

# ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి, బూర్గుంపాడు

కార్యస్థానము : పాల్వంచ

(... : ఈశ్వర ఉగాది)



...జ పోషకులు :

... అప్పారావు నవయి అశ్వారావు
...ందార్లుగారు, పాల్వంచ
... సంస్థానాధీశ్వరులు.

...ోషకులు :

...ంకట రామారావు బహద్దరు
..., అశ్వారావుపేట.

ఆంధ్రవాఙ్మయ సేవాసమితివారి
ద్వితీయ సంస్కరణ.




పాల్వంచ సంస్థాన విద్యాశాఖాధికారులును,
భాషా సేవా కార్యదక్షులు నగు
బ్రహ్మశ్రీ కొత్తపల్లి వేంకట రామలక్ష్మీనారాయణశర్మగారికి
'సాహిత్యవిశారద' బిరుద ప్రదాన సందర్భమున సమర్పింపబడిన
అ భి నం ద న ము లు.

బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి,
దుద్దుకూరు వేంకటప్పయ్య చౌదరి,
ప్రచురణకర్తలు.

ఆంధ్రవాఙ్మయ సేవాసమితి,
[illegible]
కార్యస్థానము:- పాల్వంచ.
వృష.

* * *

అశ్వారావుపేట పురపరిముఖులును
ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి రాజపోషకు లగు
శ్రీ శ్రీ రాజా కందిమళ్ళ వేంకట రామా రావు
బహద్దరు జమీందారువారు,

వినాయకపురం పటేలు, భూస్వాములు నగు
శ్రీ నల్లపు వీరయ్యగారు
సన్మాన విరాళమునను,

కొత్తగూడెం అగ్రహారీకు లగు
శ్రీ చిట్టి శేషయ్యగారు,

గుండాలపట్టీ వర్తకదారు లగు
శ్రీ నేరేళ్ళకుంట హనుమంతరావుగారల
విరాళ సహాయమునను
పరిచరితము.

* * *

# APPRECIATION

OF

*His Excellency The Right Hon'ble*

**Sir Akbar Hydari,**

**Nawab Hydar Nawaj Jung Bahadur,**

P. C., B. A., L. L. D., D. C. L.,

*President, Executive Council,*

H. E. H. The Nizam's Government, Hyderabad,

( Deccan. )

---

H. E. H. The Nizam's Government,
Hyderabad, ( Deccan. )

Constitutional
Affairs Secretariat,
14th June 1941.

" I am desired to inform you that the information about the results of your literary ability has been brought to the notice of His Excellency the President, Right Hon'ble Sir Akbar Hydari, who much appreciates your work in the literary field ".

(Sd.) Under Secretary.

మహాఘనతవహించిన శ్రీ నిజాంప్రభుత్వ ప్రధానమంత్రులగు

హిజ్ ఎక్సెలెన్సీ రైట్ ఆనరబుల్

సర్ అక్బర్ హైదరీ నవాబు హైదర్ నవాజుజంగ్ బహద్దరు

పి. సి., బి. ఏ., యల్. యల్. డి., డి. సి. యల్., గారి

# అమూల్య ప్రశంస

హెచ్. ఇ. హెచ్. ది నైజాం గవర్నమెంటు, హైద్రాబాదు, దక్కను. కాంస్టిట్యూషనల్ ఎఫైయిర్సు సెక్రటేరియట్

14 జూన్ 1941.

"మీయొక్క సాహిత్యసేవాసామర్థ్య ఫలితములగురించి ప్రభుత్వ సభాధ్యక్షులగు రైట్ ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీగారికి విన్నవింపగా వారు మీరు సాహిత్యలోకంలో చేయుచున్న కృషిని మిక్కిలి ప్రశంసించుచుంటి మని మీకు తెలియచేయవలసినదిగా నన్ను కోరిరి."

(సం) అండర్ సెక్రిటరీ.

# MESSAGE
OF
## Sir M. VENKATA SUBBA RAO,
*Agent for Berar,*
H. E. H. The Nizam's Government
AND
Ex-Chief Justice, High Court, Madras.

---

*Dear Mr. Sarma,*

You ask me for a Message and I send you one with pleasure. The objects of your Society should make an appeal to every Andhra, as I understand that its aim is to promote the cause of Andhra learning and culture. There has been of late a great awakening among the Andhras and if they are to advance socially and politically, their mother-tongue should be adapted to the needs of the present day. While we are justly proud of our great ancient classics, we should make every effort to make Telugu the vehicle of modern thought and learning. I have no doubt that your publications will serve this purpose and I send my very best wishes for the success and prosperity of your Society.

Yours Sincerely,

(Sd.) **M. VENKATA SUBBA RAO.**

మహాఘనతవహించిన శ్రీ నిజాంప్రభుత్వ బీరారు ప్రతినిధులును,
పదరాసు హైకోర్టు పూర్వప్రధాన న్యాయమూర్తులు నగు
శ్రీ సర్ ముత్తా వేంకట సుబ్బారావుగారి

## సందేశము

ప్రియమైన శర్మగారికి

మీరు నన్ను సందేశమును బంపుమనినారు. నే నీ సందేశమును సంతోషముతోఁ బంపుచున్నాను. మీ సమితియొక్క యాదర్శము ఆంధ్ర సాహిత్యమును, ఆంధ్రులసంస్కృతిని నుద్ధరించుట యగుటచే, మీ సమితి యాంధ్రులకైన ప్రతివ్యక్తికిని ముదావహమే యగును. ఈ నాఁ డాంధ్రమహాజనులలో నొక గొప్ప ప్రచలనము కలిగినది. ఆంధ్రులు సాంఘికముగను, రాజకీయముగను నభివృద్ధి బొందవలయు నన్నచో వారి మాతృభాష ప్రస్తుతావసరముల కనుకూలమైనదిగ సంస్కరింపఁబడవలయును. మన ప్రాచీన ప్రబంధములంగాంచి మనము గర్వపడుట న్యాయ్యమే. అయినను మన మాతృభాష యధునాతన భావపరంపరలను, సంస్కృతిని వెల్లడింపగలిగినదై యుండవలయును. మీరు ప్రచురించుచున్న గ్రంథము లీ కృత్యనిర్వహణమునం దెంతేని సమర్థము లని నా విశ్వాసము. మీ సమితి సర్వతోముఖాభివృద్ధినొందు గాత మని మనఃపూర్వకమైన నా శుభాశంసనము లందికొనుడు.

ఇట్లు

(సం) ఎం. వేంకట సుబ్బారావు.

# నివేదనము

పాలవంచ సంస్థాన విద్యాశాఖాధికారులును,ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి కార్యదర్శులును, పాలవంచ గ్రంథాలయాధ్యక్షులును, కుకునూరు గ్రంథాలయ సంస్థాపకులును నగు శ్రీయుత కొత్తపల్లి వేంకటరామలక్ష్మీ నారాయణశర్మగారికి జయపురాధీశ్వరులు, సాహిత్య సామ్రాట్టులును నగు శ్రీ శ్రీ విక్రమ దేవవర్మ మహారాజులుంగారి సమక్షమున 'సాహిత్య విశారద' బిరుద సత్కారమును గావించిన శ్రీ ఆంధ్ర భారతీ తీర్థ వారికి కృతజ్ఞతను తెల్పుచు శ్రీ శర్మగారి నభినందించుటకు 12-1-41 తేదీ సాయంకాలము 4 గంటలకు శ్రీఅశ్వారాయ ఆంధ్రభాషా నిలయభవనమందు ఎల్లరికి అల్పాహారవిందొసంగఁబడినది. పిదప పాలవంచ సంస్థానాధీశ్వరులైన శ్రీశ్రీ విజయాప్పారావు సనైౖ అశ్వారావు బహద్దరువారి భవనమున సన్మాన సమావేశము జరుపఁబడినది.

దైవప్రార్థనానంతరము ఆహ్వాన సంఘమువారి తరపున శ్రీ డాక్టరు బాబూరావుగారు శ్రీ శర్మగారినిగుఱించి ప్రసంగించుచు శ్రీ శర్మగారు ఏలూరులో విద్యాసంపదను గడించి, ఆంధ్రజాతీయ విద్యాలయమునకు వ్యవహర్తగను, ఉపాధ్యాయులుగను, గ్రంథాలయాధిపతులుగను పనిజేసి 1925 సంవత్సరమున విద్యావిషయకముగ చాల వెనుకఁ బడియున్న మన్నెపుప్రాంత మనఁదగు నీపాలవంచసంస్థానము నందలి అమరవరమను గ్రామములో పౌరుల ఆహ్వానము ననుసరించి శ్రమయనక వచ్చి ఆంధ్ర గౌతమ్యాశ్రమ మను నొక విద్యాసంస్థను స్థాపించి భాషాప్రచారమునకుఁ గడంగిరి.

1926 సంవత్సరమున కుకునూరున ప్రముఖుల తోడ్పాటుతో 'శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషా నిలయమును' స్థాపించి సాహిత్య విద్యావిషయక ప్రచారమునుగావించిరనియు,దురదృష్ట వశమున నా గ్రంథాలయము పరశురామప్రీతి కాఁగా మఖల రెండువేల పుస్తకముల ననేకశ్రమల కోర్చి సమకూర్చి పునరుద్ధారణ జేసిరనియు, అదియుగాక స్వయంకృషివలననే 1933 వ సంవత్సరమున సంస్థాన విద్యాశాఖాధికారిత్వమును బడసి బ్రిటిషు గవర్నమెంటు నైజాం గవర్నమెంటువారి పాఠశాలా నిర్మాణ నియమములను క్రోడీకరించి సంస్థానమున ప్రాథమిక విద్యాభివృద్ధికి ప్రచారమును సాగించి, అధికారుల మన్ననలకు పాత్రులై రనియు, బూర్గంపాడునందు 'ఆంధ్రవాఙ్మయ సేవా సమితికి' స్థాపకులై సాహిత్య సంపుటి యగు కిన్నెరయను గ్రంథమును వెలువరించి సాహిత్యకృషి చేసిరనియు, ఇట్టివారికి శ్రీ భారతీతీర్థవారు 'సాహిత్య విశారద' యను బిరుద మొసంగి గౌరవించుట మనకెల్లరకు నభినందింపఁదగు విషయమనియు, మా ఆహ్వానము నంగీకరించిమీరందరు శ్రమయనక విచ్చేయుట ముదావహ మనియు,ముఖ్యముగా మన డివిజనల్ ఆఫీసరుగారు మేము అడిగినంతనే అధ్యక్షులుగ నుండుట కంగీకరించుట ఎంతో భాగ్యమనియు,శ్రీ వారు అధ్యక్షపదవిని స్వీకరించి కార్య క్రమము కొనసాగింప కోరుచున్నా మనియు నుడువుచు అధ్యక్షులను శ్రీ శర్మగారిని పూలమాలలతో నలంకరించిరి.

పిమ్మట పలుప్రాంతములనుండి సమావేశమునకు రాలేని ప్రముఖులు పంపిన సందేశములను చదివిరి.

బీరారు ఏజంటులైన శ్రీ సర్ ముత్తా వేంకటసుబ్బా రావుగారు, ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులైన డాక్టరు.సి. ఆర్. రెడ్డిగారు, కాశీవిశ్వవిద్యాలయోపాధ్యక్షులైన శ్రీ సర్. యస్. రాధాకృష్ణపండితులు,మద్రాసు యూనివర్సిటీ లైబ్రేరియన్, యస్. ఆర్. రంగనాథన్‌గారు, శ్రీ శ్రీ పిఠాపురం యువ రాజావారు, నిజాంప్రభుత్వ ఎక్సైజు డిప్యూటీకమీషనరు లగు మౌల్వీ అహమ్మదు సైయ్యదు సిద్దీఖ్ సాహేబుగారును, నిజామాబాదువిద్యాధికారులగు మౌల్వీ అబ్దుల్‌రషీదు సిద్దీఖ్ సాహెబుగారును, శిరిపూరు తహసీల్ దారు లగు, యన్. దుర్గయ్య,బి.ఎ., గారును, ఉభయభాషాప్రవీణ తుమ్మలసీతారామమూర్తిచౌదరిగారును, వరంగలుజిల్లా ఆంధ్రజనసంఘాధ్యక్షులు శ్రీ పర్చా రంగారావు పంతులుగారును, పండిత ఆదిరాజు వీరభద్రరావు గారును, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారును, ఆంధ్రి సంపాదకులు, శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారును, శ్రీరామమూర్తి, బి. ఎ., గారును, అచ్యుతన్న నరసింహారావుగారును మున్నగువారు తమ అమూల్య సందేశముల సంపిరి. సభకు రాజాలక శతావధాని శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు, మౌల్వీ ఉమర్ అలీషాకవిగారు, శతావధానులు శ్రీ శేషాద్రిరమణకవులు, శ్రీపతిత్ర్యంబకరావుగారు, దోమా వేంకటస్వామి గుప్తగారు, సాగి వెంకటనరసింహము ఎం. ఎ. గారును బంపిన అభినందన పద్యములు చదువఁబడినవి.

తరువాత సభాధ్యక్షులు అయిన మౌల్వీ గులాం మహమూద్ ఖాన్ సాహెబుగారు, ప్రారంభోపన్యాస మొసఁగుచు, తాము తెలుఁగులో ఉపన్యసింప లేనందులకు విచారించుచున్నా

మనియు,ఎందరో పెద్దలుండగా తమకీ యాధిక్య మొసంగినందు లకు కృతజ్ఞుల మనియు, ఈసంస్థానమునందు చాలా కాలమునుండి విద్యాసేవ చేయుచున్న శ్రీ శర్మగారి కృషికి శ్రీ భారతీతీర్థ వారు సాహిత్య విశారద బిరుదమిచ్చుట సంతోషకర మనియు, అట్టిసంస్థకు సంస్థానప్రజలు కృతజ్ఞులనియు ఏ జాతిగాని అభి వృద్ధిజెందవలెనన్న విద్యయే ఆవశ్యక మనియు, విద్యలేనివాడు పశుతుల్యుఁ డనియు జపాను అమెరికా దేశములు విద్యాప్రచా రముచేతనే ప్రపంచమున పేరువడసిన వనియు, ఇప్పుడు మన దేశమునందు మాతృభాషాబోధనావశ్యకతకు ప్రాముఖ్యత నొసఁగుచున్నారనియును, అదియే బాలురను విజ్ఞానవంతులను జేయు సాధనమనియును, ఏభాషలోగాని సర్వదా కృషిచేయుట వలననే ఘనత కలుగు ననియు, శ్రీ శర్మగారిని ఇక్కడివారు ఇతరప్రాంతముల వారు విద్యాధికులు అధికారులును గౌరవించు టకు కారణ మిదియే యని నుడివిరి.

పిదప శ్రీశర్మగారికి పాలనంచగ్రంథాలయ పక్షమున శ్రీ వసం వేంకటా్రమ నరసింహారావుగారు అభినందనపద్యములు చదివి ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ ప్రథమసంపుటమును బహూకరిం చిరి. కుకునూరు గ్రంథాలయము తరఫున శ్రీ చిలుకునూరి సుబ్బారావుగారును సన్మానపద్యముల చదివి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ద్వితీయ సంపుటమును బహుమానించిరి. అశ్వారావు పేట గ్రంథాలయ పక్షమున అచ్చటి ప్రముఖులు అభినందన పత్రమును అర్పించి శ్రీ రాజా కందిమళ్ల వేంకటరామా రావు బహద్దరు జమీందారువారు పంపిన సందేశమును విని పించి శ్రీవారు సన్మానరూపముగ యేబది రూప్యములను,

వినాయకపురం పటేలు, భూస్వాములు నగు శ్రీనల్లపు వీరయ్యగారంపిన యిరువదియైదు రూపాయలును, శ్రీ ముకుంద రామమూర్తికవిగారు సమర్పించిరి. రుద్రంకోట గ్రంథాలయపక్షమున శ్రీ యామిజాల వేంకట శాస్త్రిగారు శ్రీ శర్మగారి నభినందించుచు పండితారాధ్య చరిత్రను బహూకరణముగా నొసంగిరి. సంస్థానోపాధ్యాయుల పక్షమున జనాబ్ మౌల్వీ అబ్దుల్ రజాఖ్ సాహెబుగారును, శ్రీ మల్లాది వేంకటసుబ్బయ్యగారును, ఉర్దూ తెలుఁగులందు సన్మానపత్రముల సమర్పించి ఖురాన్ షరీఫ్, భగవద్గీత గ్రంథముల నొసంగి సత్కరించిరి. పూర్వ విద్యార్థిసంఘుపక్షమున శ్రీ కొండుభట్ల విశ్వనాథంగారు కృతజ్ఞతాభినందనపద్యముల చదివి ఖద్దరు వస్త్రములచే సన్మానించిరి. జటప్రోలుసంస్థాన మండలి కొల్లాపుర స్నేహలతాసంఘు పక్షమున శ్రీవాజపేయయాజుల రామసుబ్బారాయడు బి. ఏ., గారు స్వయముగ రాదలచి కారణాంతరములచే రాజాలమికి విచారించుచు పంపిన అభినందన పద్య మిత్రలేఖను శ్రీ చిలుకునూరి సుబ్బారావుగారు చదివిరి. బూర్గుంపాడు పౌరుల పక్షమున శ్రీ మాజేటి రామచంద్రయ్యగారు, దుద్దుకూరి వెంకటప్పయ్య చౌదరిగారు అభినందన పత్రి మర్పించిరి. ఆంధ్రవాఙ్మయసేవాసమితి పక్షమున సమితి సభ్యులును కవులు నగు శ్రీ ముకుంద రామమూర్తి, బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి, చిలుకునూరి సుబ్బారావుగార్లు అభినందనపద్యములు చదివి ఆంధ్రభాషా చరిత్రమును (రెండు సంపుటములు) సమర్పించిరి. రాజాలని సమితిసభ్యులగు శ్రీ హరి రామలింగశాస్త్రిగారు, ఉభయ భాషాప్రవీణ విశ్వనాథ

వేంకటేశ్వరులుగారు, పన్యాల వెంకటరంగనాథరావుగారు, ఉభయ భాషాప్రవీణ పెరవలి లింగయ్యశాస్త్రిగారు, కొమరగిరి నారాయణరావుగారు పంపిన సందేశాభినందన పద్యములను శ్రీ సాహిత్యవిద్యాప్రవీణ కొత్తపల్లి మృత్యుంజయ సోమయాజి గారు శ్రావ్యముగా చదివి వినిపించిరి.

తరువాత శ్రీ శర్మగారు తమ నీ రీతి ఆంధ్ర భారతీతీర్థ వారు, వివిధభాషాసంస్థలవారు, కవులు, పండితులు, ప్రముఖులు అభినందించి నందులకును, సన్మానించి నందులకును కృతజ్ఞుల మనియు తమ కొసరించిన యీ గౌరవమును తమకు సంబంధిం చినసంస్థలకే చెల్లుననియు, అల్పజ్ఞు లగు తమ కేమియు గొప్ప తనము లేదనియు, ఈ బిరుద ప్రదానమువలన తమ కార్య భారము హెచ్చైన దని తలంచుచుంటి మనియు, తా మీ ప్రాంతమున చేసిన సేవకన్న చేయవలసినది ఎక్కువగా నున్నదనియు దానికి ప్రజలు ప్రభుత్వము మిక్కిలి చేయూత నొసఁగవలె ననియు, సంస్థానమునం దిట్టి యపూర్వమైన సాహిత్యవిషయకసమావేశమునకు అధ్యక్షత వహించి అమూల్యోపదేశముల నొసఁగి సభా విజయమునకు తోడ్ప డిన శ్రీ డివిజనల్ ఆఫీసరుగారికి, ఈ సమావేశమునకు ముం దంజవేసి సర్వప్రయత్నముల జరిగించి తమ నీ రీతి సన్మానించు టకు కారణభూతు లైన శ్రీ పాలవంచ గ్రంథాలయ సభ్యుల కును, సన్మానము లొసంగిన వారికి వందన సమర్పణఁ జేయుచు సన్మానరూపముగ నొసంగిన ద్రవ్యముతో ఆంధ్రవాగ్దేవికి నూతనాలంకారముల సమకూర్చగల మనియు ప్రత్యుత్తర మొసంగిరి.

ఆపైన అధ్యక్షులు ఈ సంస్థానమున గల లోకలుఫండ్ స్కూళ్ళలో 50 మంది పిల్లలకన్న ఎక్కువగ నుండవలెననియు అట్టిచో మాకు తెలిపిన మరియొక ఉపాధ్యాయునిగూడ నేర్పరతుమనియు, మరియొకమారు శ్రీ శర్మగారిని ఇతోఽధిక ముగ భాషాసేవఁ జేయుటకు ప్రోత్సహించుచుంటి మనియు, ఈ సభను ఇట్లు సమావేశపరచి నందులకు శ్రీడాక్టరు బాబూ రావుగారిని, అశ్వారావుపేట మొదలగు పలుతావులనుండి యిచటి కరుదెంచి సన్మానించిన ప్రముఖులను కొనియాడుచుంటి మనియు, శ్రీ శర్మగారికి భగవంతుడు ఆయురారోగ్యముల నిచ్చి ప్రోచుగాత మని కోరుచున్నామనియు చెప్పి ముగించిరి.

శ్రీ డాక్టరు బాబూరావుగారు, శ్రీ ముకుంద రామ మూర్తిగారును సమావేశమున కధ్యక్షత వహించి జయప్రద ముగా కార్యక్రమమును కొనసాగించి నందులకు శ్రీ డివిజసలు ఆఫీసరుగారికిని, శ్రమ యనక సభకు విచ్చేసినందులకు సంస్థాన ప్రజలకును, కృతజ్ఞతాభివందనముల నర్పించుచు ఈ సమా వేశము ప్రత్యేక వైలక్షణ్యము కలిగియున్నదనియు శ్రీ డివి జన్ సాహెబుగారు అధ్యక్షత వహించుటయు ఉమర్ ఆలీషా మొదలగు మహమ్మదీయ ప్రముఖులు అభినందన సందేశము లంపుటయు ప్రాచీన కాలమందలి హిందూమహమ్మదీయ విజ్ఞాన సామరస్యమును దలపించుచు ఈ కాలములో నిట్టి సంఘటన శుభావహ మనియుఁ జెప్పి ముగించిరి. అంతట జయ జయ ధ్వానములతో సమావేశము పరిసమాప్తి నొందింపఁ బడినది.

మా ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి గడపినకొలది జీవితములో తొలుత కిన్నెర సాహితి సంపుటిని వెలువరించి ప్రశస్తి వడసిన కొలది కాలమునకే కార్యదక్షులగు శ్రీ శర్మగారికి బిరుద సన్మాన విశేషము వాఙ్మయ రంగమున ముఖ్య ఘట్టముగ పరిణమించినది. తత్ఫలితముగ వారి ప్రాంతమున నొనరించిన వాఙ్మయ కృషిని గ్రంథస్థము చేయ పలువు రభిలషించుట చేతను నిందు కనుగుణ్యముగ పై మహనీయులు, కవులు, పండితులు, సంస్థలు, సంఘములు, వివిధరీతుల చదివింపు లంపియుండుటచేతను, ఈ రచనలన్నిటిని చేర్చి 'చదివింపు'లను పేరుతో అశ్వారావుపేట పురప్రముఖులగు శ్రీ శ్రీ రాజా కందిమళ్ళ వేంకట్రామారావు బహద్దరు జమీందారుగారు, వినాయకపురం పటేలు, భూస్వాములు శ్రీ నల్లపు వీరయ్యగారొసంగిన సన్మాన ద్రవ్యసహాయమున ఈ సంపుటిని వెలువరించు భాగ్య మొదవినది.

ఇది యొక సరస్వతీ దేవ్యారాధకుని సన్మాన మగుటచేతను, సరస్వతీ దేవ్యారాధనము సారస్వతయు లెల్లర యారాధన మగుటచేతను మా యొనరించిన కృషి సరస్వతీ ప్రీత్యర్థ మగుత మని యింతతో ముగింపుచున్నాము.

| | |
|---|---|
| ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి. | బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి |
| కార్యస్థానము, పాల్వంచ. | దుద్దుకూరు వేంకటప్పయ్య చౌదరి |
| వృష విజయ దశమి. | సహాయ కార్యదర్శులు. |

# అధ్యక్షోపన్యాసము

అభినందన సభాధ్యక్షు లగు

జనాబు మౌల్వీ గులాం మహమూద్ ఖాన్ సాహెబు

డివిజన్ ఆఫీసరుగారి

ఉపన్యాసం.



సోదరులారా!

ఈ సమావేశానికి చాలామంది అధికారులు, విద్యార్థులు, పెద్దలు, ఇతరప్రాంతప్రముఖులు దయచేశారు. ఇందులో తెలుగువారు బహుసంఖ్యాకులు. అందరికీ తెలిసేటట్లు తెలుగులో ఉపన్యాసం చేయలేనందుకు విచారిస్తున్నాను. నాకు తెలిసిన నాలుగుముక్కలు నా ఉర్దూ భాషలో చెప్పెదను. నన్ను మన్నించి నా ఉపన్యాసాన్ని వినగోరుతున్నాను.

మనప్రాంతంలో, అందులో మన పాల్వంచ సంస్థానంలో ఇలాంటి సభలు జరగడం చాలా అరుదు. ఇట్టి ప్రాముఖ్యత మన సంస్థానానికి లబ్బడం మన అదృష్ట మనాలి. శ్రీ శర్మగారు చాలాకాలంనుంచి ఈ ప్రాంతంలో అమోఘమైన కృషి చేయడంవల్లనే వారికి శ్రీ భారతీతీర్థవారు 'సాహిత్య విశారద' అనే బిరు దిచ్చి సన్మానించారు. వారికి మనమందరము కృతజ్ఞులము. ఇలాంటి విషయం మన అందరికీ విద్యాప్రోత్సాహాన్ని కలిగిస్తుందని చెప్పాలి,

'మనిషి' అనిపించుకోవడానికి ముఖ్యంగా 'విద్య' అనేది వుండాలి. అది లేనివాడు గేదె, మేకవలె ఒకపశువు అనిపించు కుంటాడు. ఇతర దేశాల్లో విద్యకున్న ప్రాముఖ్యం గమనించా లంటే జపాను, అమెరికా దేశాలను పరికించాలి. జపానులో నూటికి నూరుపాళ్లు చదువుకున్న వా రుండటంవల్ల ఆ దేశం ఎంత అభివృద్ధిలో వుందో మీకు తెలియనివిషయం కాదు. అమెరికా దేశంకూడ అలాగే ప్రపంచంలో ప్రముఖస్థానం వహించింది. నేను చదువుకునే రోజుల్లో మన దేశంలో అయిదు విశ్వవిద్యాలయాలు మాత్రం వుండేవి. యాభై సంవత్సరాల నుండీ జరిగిన ప్రచారప్రబోధాలవల్ల ఇప్పటికి యూని వర్సిటీల సంఖ్య యిరవై దాకా పెరిగింది. ఏ జాతిగాని, ఏ భాష గాని, ఏ దేశంగాని అభివృద్ధి పొందాలంటే విద్యాప్రచారం బాగా సాగాలి. ఇప్పుడు ఆంధ్రులకు ప్రత్యేకంగా యూని వర్సిటీ యేర్పడింది. అందువల్ల తమ మాతృభాషలో సర్వ విజ్ఞానమూ సంపాదించవచ్చు. అధునాతనయుగంలో గొప్ప గొప్ప విద్వాంసు లందరూ మాతృభాషాబోధనకు ప్రాముఖ్యం యివ్వా లని ఆందోళన సల్పుతున్నారు. ఇతర దేశాల్లో చాలాకాలం నించే ఈ ప్రచారం సాగుతున్నది. అలా మాతృ భాషాబోధన జరిగినప్పుడే విద్యార్థుల హృదయాలకు చెప్పే విషయం బాగా హత్తుకపోతుంది. మన శర్మగారు ఈ సంస్థా నంలో విద్యాధికారులుగా వుండి తగినంత విద్యాప్రచారం సాగిస్తున్నారు. వారిని మీ అందరితో బాటు నేనున్ను హృద యపూర్వకంగా అభినందిస్తున్నాను. ఇక్కడి ప్రముఖులు, ఇతర

ప్రాంతంలోని విద్యావైశద్యము గలవారు, ఉన్నతాధికారులు ఇంకా ఎంతోమంది శ్రీ శర్మగారిని, వారి కృషిని మెచ్చుకుంటూ పంపిన సందేశాలు చూస్తే శ్రీ శర్మగారి శక్తిసామర్థ్యాలు విశదమౌతవి.

ఈ సంస్థానంలో వున్న లోకల్ ఫండు స్కూళ్ళ అభివృద్ధికూడ గమనింపతగ్గ విషయం. శ్రీ శర్మగారు సంస్థానానికి వచ్చినది మొదలు విద్యాప్రచారం బాగా జరిగింది. ప్రతి స్కూల్లోను యాభైమంది పిల్లలుండేటట్లు చూడటం ప్రజల యొక్క విధి. అంతకన్న ఎక్కువమంది వుంటే మాకు తెలియజేస్తే, సూపర్వైజరుగా రైన శ్రీ శర్మగారి ద్వారా మరియొక యుపాధ్యాయుణ్ణి ఏర్పరుస్తాం.

ఇంతమంది పెద్దలుండగా నాకీ గౌరవం యిప్పించినందులకు మీకు కృతజ్ఞుడను. శ్రీ శర్మగారికి పరమేశ్వరుడు ఇట్టి ప్రాభవశక్తుల నికముందుకూడ యిచ్చి యిత్తోఽధికముగా భాషాసేవ చేయిస్తూ ఆయురైశ్వర్యముల నొసఁగుగాత మని కోరుతున్నాను. ఇట్టి అభినందన సమావేశ మేర్పరచి ఇంతమందిని రప్పించి అమోఘముగా జరిపించినందులకు శ్రీ డాక్టరు బాబూరావుగారినీ, ఇతర ప్రముఖులనూ నేను చాలా మెచ్చుకుంటున్నాను.

---

# శర్మగారి ప్రత్యుత్తరము



అధ్యక్షా! మహాజనులారా!!

ఓరుగల్లు సామ్రాజ్యమున కలంకారమై, అశ్వారాయ బిరుదంబున వాసికెక్కి, శౌర్యధైర్యాదికముల ప్రసిద్ధిగాంచిన ఆంధ్ర ప్రభువర్యులచే పూర్వమునుండియు పాలింపబడుచు, పూర్వచారిత్రిక చిహ్నముల కాలవాలమై, పాల్వంచ సంస్థానమునకు రాజధానీనగరముగ విలసిల్లి, కాలవశమున ఒక చిన్న పల్లెటూరుగ మారి, ప్రభుత్వాదరణమున, దివ్యభవనములతో, నూతనశోభతో పునర్నిర్మిత మైన ఈ రాజధానీనగరమందు నేడు ఇంతమంది పెద్దల సమక్షమున, ఏకోన్ముఖముగా తమ రంద రీ రీతి నన్ను గౌరవించినందుల కెంతయు సంతసించుచు కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను. ఇట్టి సమావేశమునకు మన సంస్థాన ప్రధానాధికారులైన శ్రీ డివిజన్ ఆఫీసరుగా రధ్యక్షత వహించి సభావిజయమునకు మార్గదర్శకులైనందుల కెంతయు ధన్యుడను, వారికి కూడ అనేకవందనము లర్పించుచున్నాను.

నా బిరుదప్రదానమునకు సంతసించుచు కొన్ని గ్రంథాలయములవారు సన్మానపత్రముల సమర్పించిరి. కొన్ని భాషా సంస్థలు, విద్యాసంస్థలు అభినందనపత్రము లొసంగినవి. పండితులు సదభిప్రాయము లిచ్చిరి. కవులు పద్యహారములు వేసిరి. అధికారులు ప్రశంసల నంపిరి. విఖ్యాతులైన వారు శ్లాఘించిరి.

మిత్రులు యథోచిత గౌరవసత్కారముల సల్పిరి. ఇదంతయు వారికి నా కృషియందు గల ఆదరాభిమానములు తప్ప అంతటి గౌరవార్హతకు నే నెట్టి మహోత్కృష్టకార్యములను చేయలేదు. అంతటి సాహిత్య విశారదత్వమును నాకడ లేదు. నా కీ బిరుద మొసంగబడు నని కలలోనైనను స్మరించియుండలేదు. నేను గొప్పవిద్యాధికుడనా కాను. గొప్పపండితుడనా కాను. గొప్పకవినా కాను. గొప్పచరిత్రకారుడనా కాను. తుదకు గొప్పయధికారినా కాను. కాని ఈ మహనీయుల కందరికిని సేవచేసి తరించవలె నని మాత్రము కోరువాడను. పలువురకు హితముతో కూడుకొన్న పనిచేయుటయందు నేర్పరి ననియో, సాహిత్యసంపత్తి లేక పోయినను, అణగిమణగియున్న సాహిత్య సంపత్తి గలవారిని పురిగొల్పి, సాహిత్యవిశారదుల చేయగల ననియో, లేక నాయందుగల ఏశక్తి సామర్థ్యముల గుర్తించియో ఈ మారుమూలనున్న నాకు ఆంధ్ర పరిశోధక విశ్వ విద్యాల యము వారీ బిరుదము నంటగట్టిరి. ఈ విశ్వ విద్యాలయము మట్టుకు ఒక గొప్ప అంతర్జాతీయ విద్యా విషయక సంస్థగ మన దేశములో, జయపురాధీశ్వరులును, ఆంధ్ర విశ్వ విద్యాల యోపాధ్యక్షులును, సాహిత్యసామ్రాట్టులు నగు శ్రీ శ్రీ విక్రమ దేవవర్మ మహారాజులుంగారి యాధ్వర్యమున, చాల కాలము నుండి పనిచేయుచున్నది. అమెరికా, యూరోపు, ఆస్ట్రేలియా, ఇండియా దేశములందలి పలువురు విద్యాధికులచే నడుపబడు చున్నది. విజయనగరము నందలి మహారాజాగారి కళాశాల ప్రొఫెసరు బుర్రా శేషగిరిరావుపంతులు ఎం. ఏ. పి హెచ్.డి.

గారు దీని కధ్యక్షులు. మన దేశమున సంస్కృత విద్యావంతులలో పేరెన్నిక గన్న మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదాంకితులు శ్రీ తాత సుబ్బారాయశాస్త్రి గారు, రాజా సూరపనేని అచ్యుతరామరాజు బహద్దరు జమీం దారువారు, మున్నగు విద్యావేత్తలు, ప్రభువు లెందరో దీనియం దున్నారు. మన రాష్ట్రములో ఈ విశ్వ విద్యాలయ గౌరవ మును బడసినవారు—మన కీ. శే. ప్రధానామాత్యులగు శ్రీ మహారాజా సర్. కిషన్ ప్రసాదు బహద్దరువారు 'రాజ సభాభూషణ' బిరుదముచే సత్కరింపబడిరి. ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు ప్రొఫెసరు లగు శ్రీ రాయప్రోలు సుబ్బా రావుగారు 'కవిభూషణ' బిరుదమును బడసిరి, మహబూబు కాలేజి తెలుగు పండితులగు శిరోమణి సన్నిధానం సూర్యనా రాయణశాస్త్రిగారికి భారతీతీర్థ పండిత బిరుద మొసంగ బడెను. ఇంకెవరైన ఒకరిద్ద రుందురేమో నాకు తెలియదు. అట్టి వారి ప్రతిభా సేవావిశేషములు గౌరవింపబడు టెల్లరు గర్వింపదగిన విషయము. ఈనాడు మీలో మీవాడనైన నన్నిటుల గౌరవించుచున్నా రన్న ఆ గౌరవము మీకేగాని, నాకొక్కనికే చెందిన దని గర్వించజాలను. బిరుదప్రదానము జరిగి పదిమాసములు గడచినను, పలుప్రాంతములలోని మిత్రులు సహచరులు అనుచరులు ఇప్పటికైనను ముందునకువచ్చి నన్నీ రీతి గౌరవము సల్పిరన, నేనే సంస్థలకు సంబంధించిన వ్యక్తినో వాటికన్నిటికి ఆ గౌరవము సల్పిన ట్లని భావించుచున్నాను. ఏ శ్రేయోభిలాషుల తోడ్పాటున నా యుద్యమము కొనసాగు

చున్నదో వారెల్లరు నీ గౌరవమునందు భాగస్వాములే. ఏ యథి కారుల దోహదమునల్ల యిట నా విద్యాప్రయత్నములు సాగు చున్నవో వారందరు గౌరవింపబడి నట్లే. ఏ ప్రభువుల యాదరణవిశేషములు నా యున్కికి హేతుభూతమయ్యెనో, ఆ ప్రభువులకే ఇది కీర్తిదాయకము. ఏ సంస్థానమున ఈ ఉప్పు పులుసు తిని, ఇంతకాలము సుఖజీవయాత్రను గడపితినో, ఆ సంస్థానమునంతను అట్టిమహావిద్యాపీఠముగౌరవించినటు లగును. మన సంస్థానము పుట్టిన తర్వాత నిట్టి విద్యామర్యాదల కని విని యెఱుంగ లేదనిన అతిశయోక్తి గాదు. ఈ సంస్థానమున నిట్టి సన్మానమున కిదియే ప్రప్రథమము, అపూర్వమని గూడ నుడువవచ్చును. ఇటుల నా సేవను గుర్తించిన మహనీయులకును, ఆంధ్రభారతీ తీర్థ వారికిని కడుంగడు కృతజ్ఞుడను.

ఈ సమయమున, నేనీ సంస్థానమున జరిగించిన కృషిని సత్యపథమున క్లుప్తముగానైన నుడువకుండుట భావ్యముగా నుండదు. 15 ఏండ్ల క్రిందట నా జీవితము ఈ సంస్థానమున గోదావరీతీరమున గల అమరవర మను చిన్నపల్లెటూరిలో ప్రారంభమయ్యెను. అప్పటి కీ ప్రాంతము విద్యావైజ్ఞానిక విష యము లందు చాలా వెనుకబడి, ప్రాపంచిక పరిస్థితులకు సంబంధించక, కడుదూరస్థమై యున్నదనుట సత్యదూరము గాదు. దూర దేశములవారు, ఇటువైపు లన్నియు మన్నెపు ప్రాంతములే యనియు, ఇటనుండు వారు కేవలము ఆటవిక జనులే యనియు, ఇది ఎన్నో వేలమైళ్లదూరమున నున్న ఒక దేశమనియు భావించుచుండెడివారు. ప్రజలలో విద్యాసక్తి

శూన్యము. గ్రంథము లన నేమియో, పత్రికలన నెట్లుండునో చూచి యెరుంగరు. విద్యావంతులుగాని, సేవాభిలాషులుగాని అసలే లేరు. మార్గసౌకర్యము లంతకుమునుపే లేవు. విద్యా ప్రయత్నము లెటుల కొనసాగింపబడుచున్నవో, ప్రజాహిత సౌకర్యము లెట్లలవరచుకోవలయునో ఈ ప్రాంతీయులు తెలిసి కొన జాలరైరి. ఇవియే ఈ ప్రాంతీయుల అజ్ఞానాంధకార పరిస్థితులకు ముఖ్యకారణములు.

ఈ స్థితిలో చిన్నపిల్లల కొరకు పాఠశాలను ప్రారంభించి సక్రమ పద్ధతులతో, సరియైన పుస్తకములతో, గ్రామ జీవితా వశ్యక మగు ప్రాథమిక విద్యకు పునాదులు వేయుచు, విద్యా బోధన కుపక్రమించి ఆదర్శపాఠశాలగా నొనర్ప ప్రయత్నించితిని. దీనికితోడు గ్రామస్థులలో విద్యాభిలాష, ప్రపంచ జ్ఞానము కల్గింప నెంచి ఒక చిన్న గ్రంథాలయమును నెలకొల్పి ప్రబోధ మొనరింప సాగితిని. ఆనాటినుండియే ఈ సంస్థానము ప్రాపంచిక పరిస్థితులతో, మన రాష్ట్ర పరిస్థితులతో సంబంధమును కల్గించుకొనుటకు మొదలిడె ననుట నిశ్చయము. అప్పటిలో నేను పత్రికాదులందు ప్రచురించిన వ్యాసాదులవలన ఈ సంస్థాన చారిత్రక విశేషములు, స్థితిగతులు, విద్యావ్యాపనము, ప్రజాహిత సౌకర్య మార్గములు మున్నగునవి బైటపడి ప్రబోధ కారణము లయ్యెను. ఆ కుగ్రామమున ఒక సంవత్సర పరిమిత జీవితమే గడచెను. తదుపరి అంతకంటె కొంచెము పెద్ద గ్రామమైన కుకునూరు వాస్తవ్యుల అభిలాషను పురస్కరించుకొని, నా యునికి నటకు మార్చుకోవలసి వచ్చెను. వారి

యాదరణమున ఒక పాఠశాలను నడుపుచు అందే గ్రంథాల
యమును గూడ కొనసాగించితిని. నా రాకతో, అక్కడ ఎంతో
కాలమునుండి ఎదుగు బొదుగులు లేక గ్రామస్థుల నిరాదర
ణకు పాత్రమైన సంస్థాన లోకల్ ఫండు పాఠశాల కుద్వాసన
కలుగ జొచ్చెను. అంతట గ్రామస్థు లెల్లరు పై యధికారు
లకు విన్నవించి ఆ రు 10/ల వేతనము నా కిప్పింప ప్రయత్నించిరి.
ఈ స్వల్ప వేతనమున కంగీకరించిన నా స్వేచ్ఛకు కూడ భంగము
వాటిల్లునేమో యని వెనుకాడితిని గాని, అందు ప్రవేశిం
చిన ఇంకెక్కువ విద్యాసేవ చేయుట కవకాశ ముండునేమో
యని త్యాగబుద్ధి వహించి అందుల కంగీకరించక తప్పినది
కాదు. సంస్థానము నం దిది యొక ఆదర్శప్రాథమిక పాఠశాలగా
నొనర్పవలె నని ప్రయత్నించితిని. అటులనే గ్రంథాలయమును
గూడ రాష్ట్రములోగల పెద్ద గ్రంథాలయములలో నొక
దానిగ జేసి సంస్థానప్రజల కెల్లరికి అందుబాటులో నుండు
లాగున జేయ సమకట్టితిని. నే నీ పాఠశాలలో చేరినప్ప
టికి సంస్థానమున ఏ 5, 6 పాఠశాలలో పేరునకు మా
త్రము గలవు. నేనీ పాఠశాలలో ప్రవేశించినదిలగాయితు
పాఠశాలల కుండవలసిన లక్షణములు అనగా, పాఠ్య
క్రమము, పుస్తకనిర్ణయము, స్కూలు రిజిష్టర్లు, నెలసరి
లెక్కలు, ఫర్నిచరు మున్నగు వాటి అవసరముల గురించి
అధికారులకు విన్నవించుచు, పాఠశాల నాకర్షకముగ
జేయ మొదలిడితిని. ఈ చాదస్తు డెక్కడదొరకెరా యని వా
రనుకొనుచుండెడివారు. కాని నావిధులను నిర్వర్తించుకొను

చుండెడివాడను. ఇదొక విధముగ నా వ్రాతకోతలు ఏమియు నెరుంగని గుమాస్తాలకు విద్యాబోధన చేయునదిగా నుండెడిది. అధికారులకు విద్యాపరిస్థితు లెట్లుండవలెనో గ్రహించుట కవకాశముగా నుండెడిది. వారందరు నా ప్రయత్నములకు విధిగా సహాయపడుచుండెడివారు. ఆనాటి వ్రాతలు కొన్ని ఈనాడు కార్యరూపమున జూచు భాగ్యము నాకే కల్గిన దనిన గర్వోక్తి కాదు. ఇక మిగతా పాఠశాలల స్థితిని పరికించువారు లేరు. పరీక్షాధికారులు గూడ ప్రత్యేకించి లేరు. ఉపాధ్యాయు లుండీ పిల్లలు లేనివి కొన్ని, పిల్లలుండీ ఉపాధ్యాయులు లేనివి కొన్ని, ఉపాధ్యాయులు- పిల్లలులేని పాఠశాలలు కొన్ని, ఈ రెండూ ఉండీ జీతములు లేనివి కొన్ని, చదువు సంధ్యలు లేకుండా ఉన్నవి కొన్ని, ఈ స్థితిలో విద్యావ్యాపక మెట్లు జరుగునా యని ఆందోళనపడుచుండెడివాడను. అట్టి స్థితిలో విద్యావంతులైన సర్కారు అధికారులు, సంస్థాన అధికారులు రాసాగిరి. వారి నాహ్వానించెడివాడను. పాఠశాలను పరీక్షించి సదభిప్రాయములు వ్రాసి పై యధికారుల కెరింగించుచుండెడి వారు. నా పాఠశాలపద్ధతులను, అవే పుస్తకములను, పాఠ్య క్రమమును యితర పాఠశాలలలో కూడ అవలంబించునట్లు అధికారులు జరిగించిరి. ఏ 40, 50 సంవత్సరముల నుండియో సంస్థాన ఉపాధ్యాయునికి రు 10 ల స్వల్పజీతముతో జీవనోపాధి జరిగించుకొనుచు విద్యాభివృద్ధి తృప్తికరముగా జూపుట కష్టతర మని తలంచి వేతనాభివృద్ధికై ప్రయత్నింపసాగితిని. అప్పటిలో నాకు రు 20 లు, తక్కినవారికి రు 15 లు వేతనాభివృద్ధి గావింప

బడెను. ఇది యెంతయో గొప్పమాప్పదల యని నుడువుటకు సందేహములేదు. నా పాఠశాల విద్యార్థుల సంఖ్య హెచ్చగా రెండవ ఉపాధ్యాయునిగూడ నియమించిరి. నా పాఠశాలకు ఏ విషయమును గురించి వ్రాయుదునో అది అన్ని పాఠశాల లకు సంబంధించినదిగా ఆలోచించుచు అధికారులు సాయపడు చుండెడివారు.

ఇక గ్రంథాలయము గూడ సర్వజనాదరణమును బడసి పేరు ప్రసిద్ధి గాంచి, అభివృద్ధి దశలోనికి వచ్చుచు స్థిరభవన మేర్పరచి యింకెంతయో సేవ చేయనున్నంతలో, నేను గ్రామములో లేని సమయమున నిండు వేసంగిలో అర్ధరాత్రివేళ, చుట్టు ప్రక్కల యిండ్లతో బాటు గ్రంథాలయపు గడ్డియిల్లు, పాఠశాల యిల్లు, నేను కాపురము చేయుయిల్లు సర్వస్వము అగ్నిహోత్రు డారగించి నన్ను మాత్రము మిగిల్చి పోయెను. దాదాపు 2800 పుస్తకములు, ఫర్నిచరు, యావత్తు బూడిద పాలైనవి. ఈ ప్రాంతమున లేక లేక సృష్టింపబడి రాష్ట్రములో గల గ్రంథాలయములలో నాల్గవదియై దేశమున విఖ్యాతి గాంచుచున్న తరుణమున ఈ గ్రంథాలయము ఈరీతి అదృశ్య మగుట సంస్థానప్రజల దురదృష్ట మనక తప్పదు. నే నిందుకు పడిన వ్యయప్రయాస లన్నియు అగ్నిగుండములో లీనమై పోయెను. కోరిన వెంటనే సహాయపడని కవిగాని, గ్రంథకర్త గాని,పత్రికాధిపతిగాని లేరనిన ఈ గ్రంథాలయము దేశములో ఎంతపలుకుబడి గాంచెనో నేను వేరుగ నుడువ నక్కరలేదు. ఇక్కడ జరిగిన సహాయ సంపత్తులకంటె, వెలుపల దేశములో

జరిగిన సహాయము హెచ్చు. ఇందులకు మన్నెపు ప్రాంతము లలో, ఏమియు లేనిచోట యిట్టికృషి జరిగించుచుండుటయేగాని నాగొప్పతనము గాదు. ఇక ఆ దగ్ధగ్రంథాలయ విషాద వార్త పత్రికల కెగబ్రాకెను. ఎందరెందరో కన్నీరు గార్చిరి. సాను భూతి నెరిగించిరి. తిరిగి గ్రంథసహాయముచే ఓదార్ప మొద లిడిరి. సభలందు సంతాప తీర్మానముల గావించిరి. రాష్ట్రము లందలి ప్రముఖులు, దేశమునందలి విఖ్యాత విద్యావేత్తలు, మదాసుయూనివర్సిటీ లైబ్రిరీ సంఘమువారు సహా యార్థము విజ్ఞాపనల ప్రకటించిరి. అంతట రెండు నెలలలోపల 1200 గ్రంథములవరకు యాచితముగను, అయాచితముగను లభ్యమయ్యెను. ఈ గ్రంథాలయ పునరుద్ధరణములోపుగ నేనెన్నియో భరింపరాని గృహచ్ఛిద్రములకు లోనైతిని. ఎట్టి కష్ట పరిస్థితిలోనైనను, కట్టుబట్టలతో మిగిలినప్పటికి దీని పున ర్నిర్మాణ ప్రయత్నము విడువలేదు. గ్రామస్థుల సహాయ ముతో భవననిర్మాణ మారంభించబడి, నిల్వసొమ్ము ఉన్న ప్పటికి అది నెరవేరలేదు.

అప్పటిలో తరచు ఖాల్సా అధికారులు, సంస్థాన అధి కారులు, వచ్చుచు పోవుచుండుట కతన నా విద్యాప్రయత్న ములగాంచి, సంస్థానములో ఇన్ని పాఠశాల లున్నపుడు వాటి పైన ప్రత్యేకాధికారి యొక రుండవలె నని అభిప్రాయపడి తత్ప్రయత్నములకు గడంగిన్న 1342 ఫసలీలో వరంగల్ జిల్లా బోర్డువారి మంజూరీని బడసి నా కీ యుద్యోగము నొసంగిరి. నే నీ స్థితికివచ్చి విద్యావృద్ధి జరిగించుట కవకాశ మొసంగి

చేయూత నిచ్చిన జనాబు మౌల్వీ ఫాయిక్ హుశేన్ సాహెబ్ తహశ్శీలుదారుగారిని, యన్. దుర్గయ్య బి. ఏ., తహశ్శీలుదారు గారిని, ఎక్సు మోతేమదు సాహెబ్ సమర్థాగారిని, మౌల్వీ అబ్దుల్ రషీదుసిద్దీఖ్ సాహెబ్ బి. ఏ. బిటి., మోహతెమిూం తాలీమాత్ జిల్లే వరంగల్ గారిని ఈ సమయమున మరువజాలను.

కుకునూరు గ్రంథాలయ మేర్పడిన పిమ్మట అశ్వారావుపేటలో శ్రీ డాక్టరు బాబురావుగారి ప్రోద్బలమున నొక గ్రంథాలయమును, రుద్రంకోటలో బ్రి॥ శ్రీ యాము జాల వేంకటశాస్త్రిగారి ప్రేరేపణమున ఒక గ్రంథాలయ మును, పాల్వంచలో శ్రీ వనం వేంకట నరసింహారావుగారి యాదరణమున ఒక గ్రంథాలయమును, మందడపల్లిలో శ్రీ ఫానుగంటి వేంకట శేషగిరిరావుగారి యభిమానమున ఒక గ్రంథాలయమును ఏర్పడి పనిచేయుచున్నవి. బూర్గంపాడు లోను, ముల్కలపల్లిలోను గ్రంథాలయము లేర్పడి కొంత కాలము పనిచేసినవిగాని చివరకు నామరూపములు లేకుండ చెడిపోయినవి. దమ్మపేటలో గూడ గ్రంథాలయ ప్రియత్న మీ మధ్య జరిగినది. ఈ గ్రంథాలయములన్నిటిలో పాల్వంచలో నున్న గ్రంథాలయమునకే శ్రీ డాక్టరు బాబురావుగారి ప్రోత్సాహమునను, స్థానికుల సహాయమునను, స్థిరభవన మొకటి నిర్మాణము గావింపబడి యుండుట ప్రశంసింప తగినది. నా కార్యస్థానము కుకునూరునుండి బూర్గంపాడుకు మార్చబడుటచే గ్రంథాలయములతో అంత ప్రత్యేక్ష సంబంధము పెట్టుకొని పనిచేయు అవకాశము తక్కువైనది. ఈ ప్రాంతమున గ్రంథాల

ద్యోద్యమవ్యాప్తికి మొదటినుండి నా ప్రయత్నములను ప్రోత్సహించుచు సానుభూతిని జూపిన ఆంధ్రపత్రికాధిపతులగు కీ. శే. శ్రీ దేశోద్ధారక విశ్వదాత, కళా ప్రపూర్ణ, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని, నిజాంరాష్ట్ర ఆంధ్ర నాయక పితామహులగు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారిని, నీలగిరి, తెనుగు, గోల్కొండ, త్రిలిజ్గ పత్రికాధిపతులను ఈ సందర్భమున విస్మరింప జాలను.

వెనుకటికన్న పాఠశాలలసంఖ్య హెచ్చింపబడుటచేత నా కార్యభారము మరింత హెచ్చైనది. మొదటిలో 7, 8 పాఠశాలలు గల్గిన సంస్థానములో నిపుడు 21 పాఠశాల లేర్పడినవి. అపుడు 170 మంది బాలురు విద్యాభ్యాసము జరిగించుచుండ నిపుడు 700 వరకు విద్యార్థుల సంఖ్య హెచ్చినది, నిమ్నజాతుల కొరకు పాఠశాలయు, ఆటవిక జాతుల కొరకు పాఠశాలయు ప్రత్యేకము ఏర్పరచ బడినవి. సన్ 1343 ఫసలీ నా రిపోర్టులోని అంశములు తరువాత కాలమున కార్యరూపము దాల్చినవి. రు 3000 లు వెచ్చించబడి పాఠశాలల కన్నింటికి అనువగు పరికరములు సమకూర్చబడినవి. పర్మనెంటు భవనములకు కూడ తగిన ప్రయత్నము జరుగుచున్నది. నా విద్యాప్రయత్నములకు చాలవరకు అధికారులు ప్రోత్సహించుచుండుట చేతనే నే నింతటి యుత్సాహముతో పనిచేయు నవకాశము కలుగుచున్నది. ఈ సందర్భమున ఇంతటి విద్యాభివృద్ధికి కారణభూతులైన జనాబు మౌల్వీ అహమ్మద్ సయ్యదుసిద్దీఖ్ సాహెబ్ నాజిం సంస్థాన్ గారిని, జనాబు మౌల్వీ గులాం మహమూద్ ఖాన్

సాహెబు డివిజన్ ఆఫీసరు, సంస్థాన్ గారిని స్మరించకుండ విడువజాలను. సమర్థులును, విద్యాభిలాషులు నగు మన డివిజన్ ఆఫీసరుగారి యాజమాన్యముననే మరికొన్ని పాఠశాల లేర్పడి, పాఠశాలలు సర్వాంగసౌష్ఠవముగఁ దనరి, 'జాగీరులలో విద్య బహుతక్కువ' అను లోపము లేకుండ, జనసామాన్యమునందు విద్యా వ్యాపకము వెనుకటికన్న విస్తరించగల దని యాశించుచున్నాను.

బూర్గంపాడులో నున్నకాలమున తీరిక సమయము లందు కాలము వృథాపుచ్చక వాఙ్మయ రచనలకు పురికొల్పుచు, కవితాగోష్ఠిని జరిగింప నెంచి సాహిత్యప్రియు లైన కొందరు మిత్రులము చేరి, 'ఆంధ్రవాఙ్మయసేవాసమితి' నేర్పరచితిమి. దీని కృషిమూలమున మాటుమణగి యున్న సారస్వత హృదయులు పలువిధముల వాఙ్మయరచనల కుపక్రమించిరి. తత్ఫలితముగ, సంస్థానాధీశ్వరు లగు శ్రీ రాజా విజయాప్పారావు సనై అశ్వారావు బహద్దరు జమీందారువారి మహారాజపోషకత్వమును బడసి, అశ్వారావుపేట శ్రీ రాజా కందిమళ్ళ వేంకటరామరావు బహద్దరు జమీందారువారి రాజపోషకత్వము నపేక్షించి, సంస్థానములోని పలువుర సహాయమును పొంది వ్యయప్రయాసలను లెక్కించక రెండేండ్ల క్రిందట 'కిన్నెర' పేరిట విఖ్యాతు లగువారి రచనలతో శ్రీ శ్రీ జయపురాధీశ్వరుల యాశీస్సులతో ఒక సాహితీ సంపుటిని ప్రకటించితిమి. దేశములో పలువురు విద్యాధికులు, సాహిత్య పత్రికలు దీనిని మిగుల ప్రశంసించి సదభిప్రాయము లొసంగి

సవి. బరారు ఏజంటులైన సర్ ముత్తా వేంకట సుబ్బారావు గారు దివ్యసందేశము నొసంగి మా ప్రయత్నముల కుత్తేజము కల్గించిరి. ఆంధ్రయూనివర్సిటీ వైసుఛాన్సెలరు లగు శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి ఎం. ఏ., డి. లిట్., గారు, బెనారస్ హిందూ యునివర్సిటీ వైసు ఛాన్సెలరు శ్రీ సర్. ప్రొఫెసరు రాధాకృష్ణన్ ఎం. ఏ., పి. హెచ్. డి., గారు, శ్రీ పిఠాపురం యువరాజా బహద్దరువారు మున్నగు వారెందరెందరో సదభిప్రాయములు లిఖించి ప్రోత్సహించిరి. మన సంస్థానములో నిట్టి సాహిత్య ప్రయత్నము లిదివర కెన్నడును జరిగియుండలేదు. ఎవరును ఆదరించి యుండలేదు. సుప్రసిద్ధ కవులయిన వారీ సంఘపక్షమున ఆహ్వానింపబడుచు సత్కరింపబడుచుండిరి. సాహిత్యవికాసమున కీ సమితి యొనరింపవలసిన కృషి యెంతయేని కలదు. ఇదంతయు భావికాల పరిస్థితుల పైన గలదు. ఒక సంవత్సరము క్రిందట బూర్గుంపాడు నుండి పాల్వంచకు మార్చబడితిని. రాజధాని గనుక సాహిత్య విద్యా ప్రయత్నములకు నిది తగిన ప్రదేశ మని భావించితిని. ఇచ్చట శ్రీ డాక్టరు బాబురావుగారి యాజమాన్యమున, శ్రీ వనం వేంకట నరసింహారావుగారు ప్రభృతుల పోషణమున స్థిరభవనముతో గ్రంథాలయము వర్ధిలుచున్నది. ఈ మధ్య దానికి నే నధ్యక్షునిగ నెన్నుకోబడితిని. ఈ గ్రంథాలయములు పెద్దవారికి పాఠశాలలుగా తనరి, విజ్ఞానోపయోగములుగానుండి విద్యావ్యాపకమునకు సహాయకారులు కాగల వని యాశించు వారిలో నే నొకడను. లోగడ కొన్ని గ్రంథాలయములు అధి

కారుల దృష్టి నాకర్షించినవి. కొన్నిటిపైన సదభిప్రాయముల కూడ వ్రాసిరి. జనసామాన్యము వీనిని ఆదరించు స్థితిలో లేదు. గతవత్సర రిపోర్టునందుకూడ ఈ గ్రంథాలయముల స్థితిని గురించి ప్రభుత్వమువారికి విన్నవించితిని. అధికారులు దీర్ఘముగ నాలోచించి, ఓరుగల్లు, హనుమకొండ గ్రంథాలయ ముల మాదిరిగా ఎంత స్వల్ప మొత్తమైనను, ద్రవ్యసహాయ మొసగూర్చి, విద్యాశాఖవారి నిరీక్షణమున ఇవి పనిచేయు నట్లు గావించినచో ఈ గ్రంథాలయములు ప్రజావిశ్వవిద్యాల యములై, వెనుకబడియున్న ప్రాంతమునందు ప్రభుత్వము వారు జరిగించుచున్న విద్యావ్యాపన ప్రయత్నములు జన సామాన్యమునందు సంతృప్తి కల్గించుటకు, పాఠశాలలకును, తలిదండ్రులకును సన్నిహిత సంబంధ మేర్పడుటకును, వయో జన విద్యాసక్తిని హెచ్చించుటకును ముఖ్యసాధనముగా నుండగల దని యాశించుచున్నాను. ఈ సందర్భమున ముఖ్య ముగ తమకు విన్నవించునది యేమనగా మొదటినుండియు, నా భాషాసేవగాని,విద్యావ్యాపనముగాని,గ్రంథాలయోద్య మముగాని, రాజకీయములతోగాని, ఏదేని మతములోగాని సంబంధించి యుండ లేదనుటకు నేనే దృష్టాంతము. ఈ సంస్థలు గాని, నేనుగాని ఎట్టి రాజకీయపరిణామమునకు లోనుగాలేదు. అట్టి యనకాశములకు, అనుమానములకు అవసరముకూడ లేదు. అట్టి వేవియు తటస్థించక పోవుటచేతనే ఈ ప్రాంతము నందు నే నిట్టి కృషిని చేయగల్గుచున్నాను. ప్రభుత్వమునకు, ప్రజలకును, సామరస్యముగ నుండి నా విధ్యుక్తముల నిర్వ

ర్తించుచు నాశక్తి సామర్థ్యముల కొలది విద్యావ్యాపనము నకు, భాషాసేవకు నా జీవితమును ధారవోయుటయే నా దృఢ సంకల్పము.

ప్రతివాడును తన మాతృభాషను ప్రేమించుట తప్పు గాదు. అది అతని జన్మహక్కు. దాని యభివృద్ధికి కృషిచేయ కూడ దని ఎవరును అనరు. ప్రతిభాషలోను, గొప్పతన మున్నది. గొప్పవిజ్ఞాన మున్నది. గొప్ప కవిత్వ మున్నది. గొప్ప సంగీతసాహిత్యము లున్నవి. ఎవరి మాతృభాషలో వారి కానంద మున్నది. గొప్ప యుత్కృష్టగ్రంథము లున్నవి. అట్టి స్వభాషావికాసమునకు ఎల్లరును పాటుపడుట విధ్యుక్త మగును. మన తెలుగువాఙ్మయమునకు మహాఘనత వహించిన శ్రీ నిజాం రాష్ట్రమే పుట్టినిల్లు. తెలుగు కవులందరు ఇక్కడివారే. ఆ నాటి ప్రభువులైన ఇబ్రహింకుతుబుషా అమీరుఖాను మున్నగువారు, తెలుగుకవులను ఆస్థానకవులుగ నాదరించి పొన్నగంటి తెలగనార్యుడుమున్నగువారురచించిన అచ్చ తెనుగు కావ్యములసంకితముబడసి తెలుగుభాషనువర్ధిల్ల జేయుటకుమార్గ దర్శకులైరి. భద్రాచలరామదాసుబిరుదాంకితుడును, దాశరథి శతకకర్తయు, నేలకొండపల్లె వాస్తవ్యుడునైన కంచర్లగోపన్న పేరు, భద్రాద్రిపేరు, ఆంధ్రచరిత్రలో, ఆంధ్రవాఙ్మయ ములో చిరస్థాయి యగుటకు ఆ నాటి తానీషారామదాసుల సంబంధమే ముఖ్యకారణము. ఇందుకు తార్కాణముగ ఈ నాటివరకు మ. ఘ. నిజాం ప్రభువరేణ్యులు భద్రాచల దేవ స్థానమునకు ధర్మకర్తలై కైంకర్యము లాచరించుచుండుటయే.

కావున మన ప్రభువులు మన యధికారులు విద్యావిషయము లకు తోడు భాషావిషయములందు కూడ సానుభూతిని గల్గి ఆదరింతు రనియే యింతగా విన్నవించుకొనుచున్నాను.

ఇక వివిధసంస్థలవారు జరిగించిన సన్మానముల గురించి కొలదిగ ముచ్చటించి విరమింతును. పాల్వంచ, కుకునూరు గ్రంథాలయములవారు 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము' మొదటి రెండు సంపుటముల బహూకృతి యొనరించినందుల కెంతేయు సర్వదా కృతజ్ఞుడను. గ్రంథములు విజ్ఞానకోశాగారములు. ధన మిచ్చిన మాయమగు నని, నాకీ గ్రంథము లిచ్చిన యింకను విజ్ఞానముకొఅకు పాటుబడగల నని సంకల్పించి యిచ్చినటు లున్నది. Encyclopaedia of Britannica అను యింగ్లీషు గ్రంథముల మాదిరి తెలుగుభాషలో నెంతయో కాలము నకు, ఎంద రెందరో విజ్ఞానవంతులు పాటుబడి యీ రెండు గ్రంథములను మాత్రము ఇప్పటికి వెలువరించగల్గిరి. ఇవి తరతర లము వరకును,నాకును నితరులకును గూడ విజ్ఞాన మార్జించ దగిన గ్రంథములు. చిరస్మరణీయములు. ఇక నమితివా రొసంగిన తెలుగు భాషా చరిత్ర సంపుటములు తెలుగు భాషకు పుట్టు పూర్వోత్తరములు తెలుపునవి. ఆంధ్ర విశ్వ కళాపరి షత్తువారు ఎంతయో కష్టించి ఎంతయో సొమ్మును వ్యయించి ఎంతయో పరిశోధన జరిగించిన మీదట ఈ యుత్కృష్ట గ్రంథ ముల వెలువరించి భాషకు మహోపకార మొనరించిరి. అట్టి గ్రంథముల నా కొసంగి జీవితాంతమువరకు మహోపకార మొనరించి రని మరువజాలను. ఇక మా యుపాధ్యాయులు

వారి సన్మానపత్రిమున ఉదాహరించిన రీతి ఈ భగవద్గీత, ఖురాన్ షెరీఫ్ లొసంగి భావిజీవితమునకు పారమార్థికము నకు త్రోవజూపిరి. హిందూమహమ్మదీయ జాతులలో నింతటి యుత్కృష్ట గ్రంథములు మరియొకటి లేవు. హిందూమహమ్మదీయ మత విజ్ఞాన సామరస్యముల కివి నా జీవితమున కుపకరించ గల వని యభిలషించుచు ఇట్టియమూల్య గ్రంథ బహూకృతిని జరిగించినందుల కెంతయు కృతజ్ఞుడను.నా పూర్వ విద్యార్థులు నూతన వస్త్రాలంకృతునిగ జేసి గురుభక్తిని జూపుట కూడ మఱపునకు రానిది. అశ్వారావు పేట పురప్రముఖులును, సంస్థాన పూర్వకార్యదర్శులును (ఎక్సు మో తేమద్) నా శ్రేయోభిలాషులు, ఆంధ్రవాఙ్మయ సేవాసమితి రాజపోషకులు నగు శ్రీ శ్రీ రాజా కందిమళ్ళ వేంకటామారావు బహద్దరు జమీందారు వారు దివ్యసందేశము నంపి యేబది రూప్యములును, వినాయక పురం పటేలు, భూస్వాములు, వదాన్యులు,భాషాభిమానులు నగు శ్రీ నల్లపు వీరయ్యగారు ఇరువదియైదురూప్యములను సన్మాన విరాళము నంపినందులకు మిగుల సంతసించుచు ఆ ద్రవ్యమును, ఆంధ్ర వాగ్దేవి కనువగు నూతనాలంకారముల నమకూర్చుటకు వినియోగించి కృతజ్ఞుడ కాగల నని మనవి.

ఇక తుదిమనవి. కార్యభారముచే గాని, ఉద్యోగ భారముచే గాని నాయం దేమైన లోపము లుండవచ్చును. మానవమాత్రునకు లోపము లుండకపోవు. నేను సర్వజ్ఞుడను కాను. ఎల్లరిని సంతృప్తి పరచుటకూడ కష్టకార్యము. కావున నాయం

దేమైన లోపము లున్న వాటిని సదయ హృదయముతో మన్నింప వేడెదను.

ఇట్లనేక విధముల రాజధానీ నగరమున సత్కరింప ముం దంజవేసిన పాల్వంచ గ్రంథాలయ సభ్యులకును, నా కృషి నభి నందించి సన్మానించిన తక్కిన గ్రంథాలయముల వారికిని, ఉపాధ్యాయులకును, మిత్రులకును, శిష్యులకును, పెద్దలకును, పండితులకును మరియొకమారు కృతజ్ఞతాభివందనము లర్పిం చుచు, మన ప్రభువులను, మనలను, మనసంస్థానమును, మన సంస్థలను మన ప్రయత్నములను వర్ధిల్ల జేయుగాక యని పరమే శ్వరుని ప్రార్థించుచు నింతటితో విరమించుచున్నాను.

# Andhra Research University

## (Bharati Thirtha)

## BIRUDA PATTA

The Chancellor of the Andhra (Bharati Thirtha) Research University is pleased to grant this Diploma of 'Sahitya Visarada' in the faculty of Sahitya to Mr. K. V. R. L. N. Sarma of Palvancha Samastan, as a mark of recognition, by this University Corporation, of duly attested attainments in Telugu Literature, and distinguished services to this University in the faculty of........... in promotion of our ideals and Educational and Cultural programmes and researches.

Given under our hands and the seal of the University this day, the Eleventh of the Month of March of the year 1940.

Seal

The Andhra Research University

VIZIANAGARAM

Sd. Sri Rajah Nallaparaju,
Mirja Achuta Ramaraju
Bahadur
Pro-chancellor (Andhra)
(Delegate)

Sd. Tata Subbaraya Sastry
Maha Mahopadhyaya
Dean

Sd. Sri Vikrama Deo Varma,
Sahitya Samrat, D. Litt
Maharaja Saheb Bahadur
Jeypore
Chancellor.

Sd. Dr. B. Seshagirirao
M. A. Ph. D.,
President,

Sd. Suryanarayanamurty
Registrar

Sd. Sri Vikrama Deo Varma,
President of Convocation

(True copy)

# ఆంధ్ర రిసెర్చి యూనివర్సిటీ

## (భారతీతీర్థ)

## బిరుదపట్టా

ఆంధ్ర రిసెర్చి యూనివర్సిటీ (భారతీతీర్థ) ఛాన్సెల్లరుగారు పాల్వంచ సంస్థానవాసులైన శ్రీ కె. వి. ఆర్. యల్. యన్. శర్మగారికి "సాహిత్య విశారద" బిరుదు ప్రదానము చేయుచున్నారు. ఈ బిరుద ప్రదానము తెలుగు సాహిత్యమునకు వారు చేసిన సుప్రసిద్ధమైన కృషిని గమనించి చేయబడినది. వారి యీ విద్యాపరిశ్రమ ఈ రిసెర్చి యూనివర్సిటీయొక్క విద్యా వైజ్ఞానిక కార్యప్రణాళికలకు ఆదర్శములకును అనురూపమైయున్నదని ప్రశంసించుచున్నాము.

ఇది మా యూనివర్సిటీ సీలుక్రింద 1940 మార్చి 11 వ తేదీన మా హస్తములతో నొసంగబడినది.

సీలు

ఆంధ్ర రిసెర్చి యూనివర్సిటీ, విజయనగరము

(సం) శ్రీ రాజా నల్లపురాజు మీర్జా
అచ్యుత రామరాజు బహద్దరు
ప్రోఛాన్సెల్లరు (ఆంధ్రప్రతినిధి)

(సం) తాత సుబ్బరాయశాస్త్రి
మహామహోపాధ్యాయ (డీన్)

(సం) శ్రీ విక్రమ దేవ వర్మ
సాహిత్యసామ్రాట్టు
డి. లిట్. మహారాజా సాహెబ్
బహద్దరు, జయపూరు
ఛాన్సెల్లరు.

(సం) డా॥ బి. శేషగిరిరావు.
ఎం. ఏ. పి. హెచ్. డి.
అధ్యక్షుడు.

(సం) సూర్యనారాయణమూర్తి
రిజిష్ట్రారు

(సం) శ్రీ విక్రమ దేవవర్మ
కావ్యకేవల అధ్యక్షులు.

Andhra Research University,
Vijayanagaram City,
South India.

President (Emeritus)
Prof. B. Seshagiri Rao, M. A. P. H. D. M. S. A.,
Dean, International Faculty
Baron W. De Barkow, Ph. D. L. L. D. F. S. D.,
Los Angeles (U. S. A.)

Foundation - Chancellor
H. H. The Maharajah Saheb
Manyasultan Bahadur of
Vijayanagaram
Chancellor (1931)
H. H. The Maharajah Saheb
Bahadur
Jhadukhand Padisha of
Jeypore

Pro-Chancellors
(For U. S. A.,)
H. E. Rufus B. Von.
Klemismid A. M.
Sc. D. Ph-et Litt. D, L. L. D.
H. E. J. M. Muc Dowell
Da Kosta. Jur D. L. L. D.
(for U S. of Brazil)
H. E. Count Charles
Otzenberga
Detaile Sc. D. Ph. D. L. L. D.
(Europe)

The provost and registrars of the Andhra Research University present their compliments to M. R. Ry., Kottapalli Venkatarama Lakshmi Narayana Sarma Garu, Vidyadhikari of Palvancha Samastanam and offer their hearty felicitations to him on the award of the title of "SAHITYA VISARADA" in recognition of his earnest and persistent services for over a decade in the cause of the library movement which is essentially, the best indigenous agency for adult education and social unity.

They trust, this honour will encourage him to avail himself of his present opportunity as Vidyadhikari in the Palvancha Samastanam.

Sd. Suryanarayanamurty
24—7—40
Honorary Registrar of
Andhra Research University
(On behalf of the executive)

ఆంధ్రరిసెర్చి యూనివర్సిటీ

అధ్యక్షుడు (ఎమిరిటస్) విజయనగరం సిటీ సౌత్ ఇండియా.

ప్రొఫెసరు బి. శేషగిరిరావు, ఎం.ఏ.పి. హెచ్ డి. యం. యస్. ఏ

డీన్, ఇంటర్ నేషనల్ ఫేకల్టీ బొరన్. డబ్ల్యు. డీ బారో౯

పి. హెచ్. డి. యల్. యల్. డి. యఫ్. యస్. డి. లాస్ అంజలెస్

(యు. యస్. ఏ.)

ఫౌండేషన్ ఛాన్సెలరు

హెచ్. హెచ్. మహారాజా

సాహెబ్ హన్నెసుల్తాన్ బహద్దరు

విజయనగరం ఛాన్సెలరు (1931)

హెచ్. హెచ్. మహారాజా బహద్దరు

ఝూడుఖాండ్ పాదుషా, జయపూర్.

ప్రో ఛాన్సెలరు (యు. యస్. ఏ)

హెచ్. ఇ. రుఫస్.

బి. వాన్ క్లిమిస్ మిడ్ ఏ. యం.

యస్. సి. డి. పి. హెచ్. ఎట్.

లిట్. డి. యల్ యల్. డి.

హెచ్. ఇ. జె. యం. మక్ డో వెల్.

డ. క్లోప్టాజర్. డి. యల్. యల్. డి.

(యు. యస్. బ్రెజిల్)

హెచ్. ఇ. కౌంటుచార్లెస్.

ఓల్డెంబర్గా డీపైల్ యస్.సి.డి.పి. హెచ్.డి.

యల్.యల్.డి (యూరోపు)

ఆంధ్రభారతీ తీర్థ అధ్యక్షులు, రిజిష్ట్రారును పాల్వంచ సంస్థాన విద్యాశాఖాధికారులైన శ్రీ కొత్తపల్లి వేంకటరామలక్ష్మీనారాయణశర్మ గారు, సాంఘికైకమత్యమునకును, వయోజన విద్యావ్యాపకమునకును దేశ హితమైన గ్రంథాలయోద్యమమున పదేండ్లపైగా కడుదీక్షతో మనస్ఫూర్తిగ గావించిన కృషిని గుర్తించి 'సాహిత్యవిశారద' బిరుద మొసంగినారమల కెంతయు నభినందించుచున్నారు.

ఈ గౌరవమువలన, పాల్వంచసంస్థానములో వీరి విద్యాశాఖాధికారిత్వముకగిన యుత్సాహముతో వినియోగింపబడ గలదనివిశ్వసించుచున్నాము.

24-7-40. (సం.) సూర్యనారాయణమూర్తి,

ఆంధ్రరిసెర్చి యూనివర్సిటీ గౌరవరిజష్ట్రారు

(ఎక్జైక్యూటీవు తరఫునుంచి)

ANDHRA UNIVERSITY

C. R. REDDY
Vice Chancellor : Waltair.

My Dear Sir,

Many thanks for your kind invitation which I regret I am unavoidably obliged to decline. I wish the function and the Samiti every success.

Yours Sincerely,
(Sd) C. R. REDDY.

---

శ్రీయుత డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి,
ఎం. ఏ. గారి

సం దే శ ము.

సి. ఆర్. రెడ్డి, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు,
వైస్‌ఛాన్సెల్లర్. వాల్టేరు.

మీ రత్యంత దయతో నాహ్వానించినందుల కనేక వందనములు. రాజాలకపోయినందులకు విచారించుచున్నాను. మీ సమావేశమును, సమితియు జయప్రద మగు గాక యని యభిలషించెదను.

(సం) సి. ఆర్. రెడ్డి.

Prof. Sri, S. Radhakristnan M. A., D. Litt
Vice Chancellor
Benares Hindu University
&
Professor of Oxford University

BENARES
21—10—40

Dear Sir,

I am glad to know the good work you are doing and hope that your efforts will receive greater response in the future.

Yours Sincerely,
Sd. S Radhakristnan.

---

కాశీ హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన
ప్రొఫెసరు సర్. రాధాకృష్ణన్, ఎం. ఏ. డి. లిట్ గారి
సందేశము.

బెనారస్.
21—10—40.

మహాశయా!

మీరు చేయుచున్న సత్కార్యమునకు సంతసించుచున్నాను. మీ పరిశ్రమ భావికాలమున నింకెక్కుడుగ ఫలించునని యాశించుచున్నాను.

(సం) యస్. రాధాకృష్ణన్.

Sir, M. Venkata Subbarao,
Agent to H. E. H. The Nizam
of Hyderabad and Berar
&
Ex.chief justice, High Court
Madras.

Hyderabad House
Nagpur
Camp:
Hermitage Guest House
Hyderabad (Deccan)
14th October, 1940.

Dear Mr. Sarma,

I congratulate you on the distinction 'SAHITYA VISARADA' which I understand from your letter has been conferred on you and send you my good wishes.

Yours sincerely,
Sd. M. Venkatasubbarao,

---

మహాఘనతవహించిన శ్రీనిజాం ప్రభుత్వ బీరారు ఏజెంటులైన
శ్రీ సర్. ముత్తావేంకట సుబ్బారావుగారి సందేశము.

హైదాబాదుహౌస్
నాగపూరు.
క్యాంపు. హెర్మిటేజి గెస్టుహౌస్
హైదాబాదు, దక్కన్
14—10—41.

ప్రియమైన శర్మగారూ!

మీరు పొందిన 'సాహిత్య విశారద' బిరుదమునకు సంతసించితిని. నా యభివందనము అందికొనుడు.

(సం) యం. వేంకటసుబ్బారావు.

Moulvi Ahmed Sayed Siddiqi
Deputy Commissioner of Excise,
H. E. H. The Nizam's Government
&
Ex-Nazim Mal Samastan, Palvancha.

Hyderabad (Deccan)
21st September 1940.

Dear Mr. Sarma,

I am glad to know that the Andhra Research University in recognition of your research work, has conferred the degree of 'SAHITYA VISARADA' on you.

I am also pleased to learn that some of the famous literary people of Madras have expressed their appreciation for your work.

I was well aware regarding your literary inclinations, while I was at Palvancha.

I congratulate you and wish you success and a bright future.

Yours Sincerely,
(Sd) A. Sayed

---

పాల్వంచ సంస్థానపూర్వ నాజంమాల్ను
మ. ఘ. నైజాం ప్రభుత్వ ఎక్సైజు డిప్యూటీ కమీషనరులు నగు
అలీ జనాబు మౌల్వీ అహమ్మదు సయ్యదుసిద్దిఖీ సాహెబుగారి
సందేశము

హైద్రాబాదు
21—9—40

ప్రియమైన శర్మగారూ!

ఆంధ్రభారతీ తీర్థవారు మీకు 'సాహిత్య విశారద బిరుద' మొసంగి నందుల కెంతయు సంతసించు చున్నాను. మదరాసు రాష్ట్రములోని పలువురు విద్యాధికులు మీరు గావించుచున్న భాషాసేవను ప్రశంసించుచున్నారని వినుటకుకూడ సంతోషముగు చున్నది. మీ భాషాభిరుచిని నేను పాల్వంచలో నున్నపుడే గ్రహించితిని. నాయభినందనముల నందుకొనుడు. మీకిక నుత్తరోత్తరవిజయాభివృద్ధి యగుగాక యని అభిలషింతును.

(సం) ఏ. సయ్యద్.

**Mr. Moulvi Abdul Rashid Siddqi Saheb, B. A. B. T.,**
District Inspector of Schools
Nizamabad, 29—11—49.

My Dear Mr. Sarma,

I heard with great pleasure that you have been conferred with the title of 'Sahitya Visarada' by the Andhra Research University. I have got personal experience that your deep learning and literary attainments are much above the present recognition by the University. Please accept my congratulations for the same and oblige and I hope for your further success.

Yours Sincerely,
(Sd.) A. R. Siddiqi
Dist. Inspector of Schools,
Nizamabad.

---

మౌల్వీ అబ్దుల్ రషీదు సిద్దిఖీ సాహెబ్
డిస్ట్రిక్టు ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు,
నిజామాబాదు.

నా ప్రియమైన శర్మగారూ!

ఆంధ్రరీసర్చి యూనివర్సిటీ వారిచే మీకు 'సాహిత్య విశారద' బిరుద మొసంగబడినందుల కెంతయు ఆనందించుచున్నాను. మీ పాండిత్యమును, భాషా ప్రియత్వమును నేను స్వయముగా నెరుంగుదును. అవి ఈ యూనివర్సిటీవారు గుర్తించిన దానికంటె అధికతరములు. ఇందులకు నా యభినందనముల స్వీకరింపుడు. మీ భవిష్యద్విజయమును వాంఛించెదను.

(సం) ఎ. ఆర్. సిద్దిఖీ.

| | |
|---|---|
| **Sri Rajah Rao Venkata Kumara Mahipati** | Vasanta Sobha. |
| **Gangadhara Ramarao Bahadur** | Adyar, |
| Zamindar, Yuvarajah of | Madras, |
| PITHAPURAM | 4th Nov, 1940. |

Dear Sir,

I thank you for your kind letter. I am sending the books. I wish your ventures every success.

Yours sincerely,
(Sd) R. V. K. M. G. RAMARAO.

---

శ్రీ శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి
గంగాధర రామారావు బహద్దరు జమీందారు
పిఠాపురం యువరాజావారి సందేశము.

వసంతశోభ
అడయార్, మద్రాస్.

అయ్యా

మీరు చేయుచున్న ప్రయత్నములు జయప్రదమగు గాకయని అభిలషించుచున్నాను.

(సం) ఆర్. వి. కె. యం. జి. రామారావు.

Mr. S. R. Ranganathan,
M. A. L. T., F. L. A.,
Madras University Librarian &
Secretary, Madras Library
Association

University Library
Triplicane, Madras.

12th Dec. 1940.

Sir,

I take this opportunity to congratulate you on the conferment of the Title "SAHITYA VISARADA" by the Andhra Research University in recognition of your literary pursuits and activities.

Yours faithfully
(Sd) S. R. Ranganadhan
Librarian.

---

శ్రీ యస్. ఆర్. రంగనాథన్ గారు, ఎం.ఏ.యల్.టి.;యఫ్.యల్.ఏ.
మద్రాస్ యూనివర్సిటీ లైబ్రేరియన్.
మద్రాసు గ్రంథాలయసంఘ కార్యదర్శి.

అయ్యా,

మీ సాహిత్యాభిరుచిని, తత్ప్రయత్నములను గమనించి ఆంధ్రభారతీ తీర్థవారు మీ కీ సాహిత్యవిశారద బిరుద మొసంగినందుల కీ సందర్భమున నా యభినందనము లంపుచున్నాను.

(సం) యస్. ఆర్. రంగనాథన్.

Mr. N. Durgiah B. A., 10th Jan. 41
Tahsildar, Sirpur

Dear Mr. Sarma,

It has given me immense pleasure to learn that your sincere efforts, to infuse literature in the most unknown and dark parts of the country, have been crowned with a title which you so well deserve. I am sure you will not stop your good work but will continue your efforts with renewed vigour.

Accept my hearty congratulations and good wishes.

Yours Sincerely
(Sd) N. Durgiah.

---

శ్రీ. యన్. దుర్గయ్యగారు, బి. ఏ.
తహశ్శీలుదారు, సిరిపూర, (నైజాం).

ప్రియమైన శర్మగారూ!

దేశములో మారుమూలప్రదేశమై అజ్ఞానముచే నావరింపబడిన ప్రాంతములో భాషాప్రచారము గావించి దేశీయులకు మహోపకార మొనరించుచున్న మీ ప్రయత్నములు మీ కర్హమగు సాహిత్యవిశారద బిరుదప్రదాన రూపముగా ఫలితము నొందినందులకు నేనెంతయు అభినందించుచున్నాను. ఈ సత్కార్యమును మీరు విడిచిపెట్టక యితోధిక దీక్షతో నిర్వహింతురని నమ్ముచున్నాను. నా యభినందనముల స్వీకరింపుడు. మీయభివృద్ధిని కోరుచుందును.

(సం) యన్. దుర్గయ్య.

శ్రీ సాగి వేంకట నరసింహముగారు, ఎం. ఏ.
లైబ్రేరియన్, గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్
లైబ్రరీ, మద్రాసు

మీ సంస్థ యభివృద్ధిని నేను మిక్కిలి సంతోషముతో గాంచుచున్నాను. దానికి మీ కార్యదీక్షయే ప్రధానకారణము. మీ కృషికి 'సాహిత్య విశారద' అను బిరుదము మిక్కిలి స్వల్ప ప్రతిఫలము. మున్ముందు మన దేశమున విద్యలకును విద్యా ప్రోత్సాహకులకును దగు సత్కారము జరుగునని ఆశించుచున్నాను. తత్ప్రాంతీయులైనను మీ కర్హ సత్కారము గావించినచో నేను మిక్కిలి ఆనందించెదను.

ఇట్లు విధేయుడు,
(సం) సా. వెం. న.

---

జనాబు మౌల్వీ ఉమర్ అలీషాకవిగారు, (ఎం.ఎల్.ఎ.) పిఠాపురము.

నేనెప్పుడో సావధానముగా దర్శనము చేయుదును. మీకు భారతీతీర్థవా రిచ్చిన 'సాహిత్య విశారద' బిరుదము సార్థకమైనది. మీ కీశ్వరుఁడు తోడగును.

(సం) ఉమర్ అలీషా.

---

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు,
సంపాదకులు, 'ఆంధ్రి', పల్లెపాలెము.

సహృదయా!

'ఆంధ్రి భారతీతీర్థ' వారు మీ వాఙ్మయసేవా ప్రవ

ణతకు మెచ్చి సాహిత్య విశారదోపాధి నొసఁగుట సముచితము. భాషాప్రియుల నెచ్చరించుట సంస్థల విధి. వెనుకఁ బ్రకటితమైన 'కిన్నెర' అభిజ్ఞాంధ్రసమితి నానందపఱిచి, మీ కీర్తి గీతములు కొన్ని శ్రావ్యముగఁ బాడి వినిపించినది. ఇప్పుడు మీ సాహిత్య వైశారద్యమును హృదయపూర్వకముగ నభినందించుచున్నది. జగదీశుఁడు మీయెడలఁ బ్రసన్నుఁడగుగాక !

(సం) సత్యనారాయణశాస్త్రి.

---

శ్రీమాన్ శతావధాని దూపాటి వేంకటరమణాచార్యులుగారు

ఆంధ్రపండితులు, ఉస్మానియా హైస్కూలు, కరీంనగరం.

మీకు 'సాహిత్య విశారద'యను బిరుదము భారతీతీర్థ వారు ఒసంగుట ఎంతయు సమంజసము. ఇది మీరుచేసిన సేవకుఁదగిన మన్ననయే. హృదయ పూర్వకముగా నా సంతసము ఇందులకుఁ దెల్పుచుంటిని. కిన్నెరసంపుటము విద్యాధికులచేఁ బ్రశంసింపఁబడుట చాల సంతోషకర మగు అంశము.

(సం) దూ. వేంకటరమణాచార్యులు.

---

శ్రీమాన్ ఆదిరాజు వీరభద్రరావుగారు

ఆంధ్రపండితులు, గవర్నమెంటు చాదరఘాట్ హైస్కూలు,

హైదరాబాదు.

ఉత్తరములు వ్రాయకపోయినను మీరు చేయుచున్న సారస్వత సేవను పత్రికలద్వారా గమనించుచునే యున్నాను.

ఆమధ్య మీ సమితి వ్యవహారములు పత్రికల కెక్కి మావంటి వారికి కొంత మనస్తాపము కల్గించెను. కాని అవియన్నియు సమసిపోయి ఇప్పు డేకీభావముతో వ్యవహరించు చున్నారని తలంతును. ఆసమయములో మీరు ప్రతీకారంగమున కెక్కక చూపిన నిగ్రహామువల్ల మీ యోగ్యత సమరసభావము నైపుణ్యము ఉత్తమమైనదిగా గ్రహింప గల్గినాను. మీరు చేయుచున్న అత్యద్భుత మైన భాషాపరిచారము అమూల్యమైనది. ఒకరి దూషణభూషణల గమనించక అట్లే కార్యజాతము జరుపుచుండ గలరు.

శ్రీ భారతీతీర్థవారు మీకు బిరుద మిచ్చినందులకు చాల సంతోషించినాను. నా అభినందనములను స్వీకరించుడు.

(సం) ఆ. వీరభద్రరావు.

---

శ్రీ అవధాని కేసరి, శతావధాని శ్రీపతి త్ర్యంబకరావుగారు, బెజవాడ.

తమకు శ్రీ శ్రీ జయపురం మహారాజావారు ప్రసాదించిన 'సాహిత్య విశారద' యను బిరుదమునకు సంతసించితిని. అంతకంటె 'కళావిశారద' యని వారిచ్చినచో హెచ్చుగా సంతసించెడివాడను. మిత్రునివృద్ధి తన శ్రేయస్సుకన్న నధికమని భారతనీతి. తమ వాఙ్మయ కుమారి ప్రౌఢభావముల నలవరించు కొన్నందులకు మిగుల సంతసించితిని. ఈశ్వరుడు మీ కుటుంబమును దీవించునుగాత.

ఇట్లు విధేయుడు

(సం) శ్రీ. త్ర్యంబకరావు, శతావధాని.

## శ్రీ శతావధాని వేదుల సత్యనారాయణశాస్త్రిగారు.

నవ్యసాహిత్య పరిషత్తు, పెద్దాపురం.

మీకు 'సాహిత్య విశారద' అనే బిరుదు ఇచ్చినట్లు వ్రాశారు. నాకు చాలా సంతోషము. భద్రాచలము నా జన్మస్థానము. నేను ఎక్కడ ఏ స్థితిలో ఉన్నా ఆ పవిత్రస్మృతి నా హృదయములోనుండి తొలగదు. ఆ ప్రాంతాలలో మీరు చాలాకాలమునుంచి సాహిత్య సేవ చేస్తున్నారు. నాబోంట్లు చేయలేని కృషి మీరు పూనుకొని చేస్తున్నారనే అభిప్రాయము నాకు గాఢముగా ఉన్నది. ఆ ప్రాంతాల వారందరితో పాటు నేనుకూడా మిమ్ములను అభినందిస్తున్నాను. అచటివారు మీ కృషిని, మిమ్ములను అభినందించడము న్యాయము. అభినందించక ఉంటే ఆ కొరత వారిదే.

(సం) వే. స. శాస్త్రి.

---

ఉభయ భాషా ప్రవీణ

## శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు.

బోర్డు హైస్కూలు పండితులు, బాపట్ల.

మీకు 'సాహిత్యవిశారద' బిరుదము లభించినందులకు సర్వథా సంతసించుచున్నాను.

(సం) తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

---

## శ్రీవాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు, బి, ఏ,

### స్నేహలతా కవితా సంఘాధ్యక్షులు, కొల్లాపురము,

### జటప్రోలు సంస్థానము.

యథార్థముగ కిన్నెర యిప్పుడే చూచితిని. బ్రహ్మానందమైనది. మహామహులెందఱో వ్యాసరాజములను వ్రాసిరి. కిన్నెర మీ కీర్తిపతాకమై ముద్దుల మూటగట్టుచున్నది. మీరొనరించు భాషాసేవ స్వార్థమునకుగాక పరార్థకమున కని స్ఫురించెడిని. విశేష ప్రజ్ఞకలవారు. ఇఁక మిమ్ముమెచ్చనివారెవరు? 'సాహిత్యవిశారద బిరుదము మీకు దగియున్నది. అది కూడచాలదనియేనా అభిప్రాయము. మీకొక బిరుదుకావలెనా? అయినా మహారాజు మహాకవి శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు మెచ్చుకొనుటయన్న సామాన్యముకాదు. ఒక విశ్వవిద్యాలయము మీ సాహిత్యసేవావిధానము గ్రహియించిరన్న నెన్నదగినవిషయమే. అంతటిపెద్దలు మీవిలువ గ్రహించుట మీ సంస్థానమువా రామోదించుట చాల ముదావహమైనసంగతి. ప్రోత్సాహమునకు కారణము. ఇట్టి మీవంటి యోగ్యులు నాకు మిత్రులగుట నా పూర్వపుణ్యవిశేషము. నన్ను ఇంతవఱకు చూడకున్నను నాయందు తమకుగల నిర్వ్యాజమైత్రి కెంతయు కృతజ్ఞుఁడను.

(సం) వి. రామసుబ్బారాయఁడు.

---

శ్రీపర్చ రంగారావుగారు, హైకోర్టువకీలు
ఓరుగల్లుమండల ఆంధ్రజన సంఘాధ్యక్షులు, హనుమకొండ.

మీ ప్రబోధమువలన అరణ్యప్రాంతముల నద్భుతమైన సంచలనము గలిగించినందులకు మీరు కడుంగడు వందనీయులు. ఆంధ్రభారతీతీర్థవారు మీకు 'సాహిత్యవిశారద' బిరుదము నొసంగినందులకు మిమ్ములను హృదయపూర్వకముగా నభినందించుచున్నాను. నిజములో మీరా గౌరవమున కర్హులు.

(సం) పర్చ రంగారావు.

---

శ్రీ చంద్రాభొట్ల శ్రీరామమూర్తిగారు బి. ఏ. (విద్యార్థి)
హిందూ కాలేజి, మచిలీపట్టణము.

ఆంధ్రభాషోద్ధరణకై పాటుపడిన వారిలో శర్మగారొకరు. సముద్రమువంటి గాంభీర్యం, కష్టనిష్ఠూరాలను గణించకుండా కార్యాన్ని సాధించే పట్టుదల, ముందు వెనుక లెరుగని త్యాగం, మొదలగు సద్గుణ విశేషాలవల్ల శ్రీశర్మగారి జీవితం సార్థకమైనది. ఒక మహదాదర్శంకోసం అడుగడుగునకు ప్రతికూల శక్తులతో పోరాడుతూ, సుఖదుఃఖాలను సరిసమానంగా యెంచి నిరంతరము కత్తులమీద నిప్పుల మీద గారడీవానివలె నడుస్తూ ప్రజాహిత జీవనం గడప గలిగిన సమర్థు లెందరో వుండరు. ఆకోవలదిలో శర్మగారికి స్థాన మివ్వక తప్పదు.

భాషావిశేష శూన్యమైన యీ ప్రదేశములలో 'భాష' అనే అక్కరములను మొదట వరవడి పెట్టినది శ్రీశర్మగారే. గ్రంథాలయములను స్థాపించి, సభలొనరించి యీమాత్రమైనా

విజ్ఞానబీజములను నాటగలిగారంటే శర్మగారి భాషాసేన, భాషోద్ధరణ అద్వితీయమైనది, అనర్గళమైనదీ అని చెప్పక తప్పదు. ఇప్పటి 'ఆంధ్రవాఙ్మయ సేవాసమితి'ని వారు నాటిన బీజాఫలితమనే చెప్పాలి. అర్థబలంగాని అంగబలంగాని లేకుండా యీాయన యీా మాత్రం భాషాసేవ చేయగలిగారంటే యీాయన ప్రతిభ అప్రతిహతమైనదే. కవి గాడు, పండితుడు గాడు, విమర్శకుడుగాడు, కాని శ్రీ శర్మగారు భాషాసేవకుడు. సాహిత్యపిపాసి. ఈయన గట్టిగా పట్టుపట్టాడంటే తక్కినవైనా యీాయన ముందర దాసోహం అనవలసిందే.

సాహిత్యము దివ్యదేవాలయమున కెనయైన దని గుర్తించి అందలి గర్భాలయమున దేజరిల్లు పరంజ్యోతినిగాంచి పరవశులై దివ్యగీతికల నాలాపించిన సారస్వతోపాసకులు మనలో నెందరున్నారు?

ఆంధ్రభారతికి శ్రీ శర్మగా రొనరించిన అపారసేవను గుర్తించి సారస్వత సంస్థలలో సమీచీన స్థానమున బహూకరించినందులకు ఆంధ్ర విశ్వభారతీ తీర్థవారికి నా ధన్యవాదాలు.

శ్రీ శర్మగారు నాటిన భాషాబీజములు మొలకెత్తి పెద్దవై పుష్పించి ఫలించు ననుట నిస్సంశయము. వారి మహాదాశయము సంపూర్ణముగ ఫలింపజేయుటకును, శ్రీ శర్మగారికి ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుటకును భారతిని దోయిలొగ్గి అర్థించుచున్నాను.

ఇట్లు సుజన విధేయుడు

(సం) శ్రీరామమూర్తి.

---

## శ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

నానాగ్రామ పరంపరానగరికాంతస్సీమధామంబులం
జేనిండం దగ నీ వొనర్చిన ప్రజాసేవల్ సమగ్రంబుగాఁ
దా నా భారతి గుర్తుపట్టినది పో ధన్యోసి ! మాన్యోసి ! ల
క్ష్మీనారాయణ ! కొత్తపల్ల్యభిజనక్షీరోదచంద్రోదయా !

విద్యాభ్యాసము చేసి దానివలనన్ విజ్ఞాన మార్జించి పై
నుద్యోగంబు లభింపఁ జేసికొని యెట్లో కాలముం బుచ్చకే
విద్యోపాసన చేయుటే యొరులచే వెన్వెంటఁ జేయించుటే
హృద్యంబై తగు జీవన వ్రతముగా నీకొన్న ని న్నెన్నెదన్.

వార్కిన్ విక్రమ దేవవర్మ ధరణీపాలుండు సాహిత్య వి
ద్యాసమాప్తని పేరుగొన్న బుధుఁ డధ్యక్షుండుగాఁ బొల్చు వి
ద్యా సంస్థానము మంత్రి శేషగిరిరాయాలోచనం జేసి నీ
కీ సాహిత్య విశారదాఖ్య బిరుదం బీఁగా మదిన్ మెచ్చితిన్,

నీ వేడకేఁగిన నీవెంట గ్రంథ భాం
　　డాగారమిష వాణి యంటి వచ్చు.
నీవేఁగు నూరూరు నిచ్చలుఁ బత్రికా
　　పఠనంబుచేఁ గళామఠము గట్టు
నీవేది తలపోసి నిర్మించినను నగు
　　మిగులు వారల కది మేలుబంతి
నీ వెందులను నున్న నీయిల్లు పూరిల్లై
　　యాఁగాక నిత్యమయ్యేది సుధర్మ

నీ వమాయకుఁడవు నిత్యనిర్మలుఁడవు
అల్ప సంతోషి వార్యజనాతిథేయి
విట్టి నిన్నిట్టి తఱియందు నేను గాంచి
శ్రీయు విద్యయుఁ బెరుఁగ నాశీర్వదింతు.

(సం) శతావధాని వేలూరి శివరామశాస్త్రి.

---

అవధాని కేసరి, శతావధాని శ్రీపతి త్ర్యంబకరావుగారు.

అలసల తావి లోన నడయాడెడు తేటి మనోజ్ఞ గానలీ
లలు తెలుగుర్క సొబంగుల తళ్కుల లామనిగున్న మావి రె
క్కల విదలించి కూయు పికకంఠరుతమ్ములు పూపపాయమం
దలవడె నీకు వాఙ్మయలతాంగి భవత్కృతపుణ్య మెట్టిదో?

నెఱసంజగాలమి కెఱటాలఁ దుళ్లింత
లూను తెమ్మెర కుఱ్ఱవాని నడలు
పొరలదీప్పుచు పొద్దు పొడుపువేళల విచ్చు
తమ్మిపుప్పొళ్ల మెత్తందనమ్ము
తరిపివెన్నెలల నెత్తావి దిక్కులఁజిమ్మె
వలపులూరించు మల్లెల హారంపు
చివురుజేరల చెల్వుచేత నామనిగప్పు
క్రొమ్మావి చెలి బెడఁగుందనమ్ము
ప్రియపుఁబోలంతులకునైన పట్టుపడని
నడవడులలోన మనసిచ్చు నుడులలోన
నెమ్మెలోన వేసములోన నెట్టు లిట్టె
మలయఁజెలగ నేర్చితివో! వాఙ్మయవధూటి.

పుట్టిపెరిగితి గౌతమీ పులినతలుల
తెలుగు జాతీయకళల దిద్దితివి విహృతు
లందు సుకవుల లేఖిను లందుకొనగ
జేసితివి యేమనందు నీ శీలమెంచి.

స్వేచ్ఛ యేలేని లేఖినీవితతి కింత
స్వేచ్ఛ యొనగూర్చుగాత సర్వేశ్వరుండు
కవికుల ప్రమోదినివికా గళము నింత
ససిగ సవరించు కొనుము వాఙ్మయవధూటి.

నిన్నుఁ గన్నయ్య విశారదుఁ డనలిపి యాంధ్రీపాదమంజీర ని
స్వనముల్ దిక్కుల కెక్కఁ జేసి రసికస్వాంతంబులన్ నిక్క యొ
య్యనఁ బేరంది కవీంద్ర సంతతి నమందానందపాథోధి దో
గినవారిన్ బొనరించు వాఙ్మయలతాంగీ! నీకు దీర్ఘాయువా!
అవధానకేసరి శతావధాని శ్రీపతిత్ర్యంబకరావు.

---

శతావధానులు శ్రీ శేషాద్రి రమణకవులు

సఖుఁడ క్రొత్తపల్లిసద్వంశసంజాత
శర్మనామధేయ సంతసమున
నీదు బిరుద సభకు నేరాకయున్నను
జాబు పంపుచుంటిఁ జదువుకొఱకు.

నిత్యము మాతృభారతి కనేకవిధంబుల సేవఁ జేసి సా
హిత్యరతిన్ వెలార్చిన యహీనమనస్వివి గాన నీకు సా
హిత్య విశారదుం డనుచు నిచ్చిరి మే ల్బిరుదంబు నీకళా
ధ్యత్యపుఁ జేనిపంట మెగదా యిది నిక్కముగా సుహృత్తమా!

కిన్నర శృతిచేసి యెన్నియో తెలుఁగుల
భావగీతికలను బాడినావు
ఆంధ్రసరస్వతి యంఘ్రికింకిణుల మ్రో
తల గౌతమితటానఁ దార్చినావు
పొత్తంపు ముత్తెదువులగూర్చి పలుకుల
పొలతికి నిలయంబు నిలిపినావు
శక్తికొలంది భాషాసేవఁ గావించి
ప్రాజ్ఞుల మన్ననల్ బడసినావు
భారతీతీర్థ పరిషత్కుమారి నీదు
సేవ కెద మెచ్చి మిగుల హర్షించి బిరుద
మిచ్చె ధన్యుండ వీవు సాహిత్యనిపుణ
క్రొత్తపల్లిశర్మ పండితాయత్తధర్మ!

నిను సాహిత్య విశారదుం డనుచు మన్నించెంగదా భారతీ
ఘనతీర్థం బని తృప్తినొందక జగత్కల్యాణ సంధాయకం
బనవద్యప్రతిభాప్రదర్శకము నిత్యాపాభివోపేతమా
తెనుఁగుంగబ్బము వ్రాసి చూపుమదిగాదే కోర్కిమాబోంట్లకున్

చిన్నతనంబునుండి కవిశేఖరు లన్నను బ్రేమ నీకు నీ
వెన్నొవిధాల భాషకొఱకే కృషిచేయుచు వందుచే రస
స్విన్నము పద్యహారమును జెల్మికి గుర్తుగఁ బంపినాఁడ నీ
మన్ననఁ జేయు పండితసమక్షమునం దిది స్వీకరింపుమా!

శతావధానులు శ్రీ శేషాద్రిరమణకవులు.

---

శ్రీ దోమా వేంకటస్వామిగుప్తగారు

శ్రీసాహిత్య విశారదేతి బిరుద ప్రాప్తాఖిలాశాయశో
రాజంతం నిరతాంధ్రసంస్కృత వచో లీలావతే స్సేవనే
ప్రేమపాత్రభవ న్నైష్ఠికం కరుణయా పాయా ద్రమానాయకః
ధీరం వేంకటరామలక్ష్మిపదయుఙ్నారాయణాఖ్య మ్ముదా.

సత్యము గాఁగ నెప్పటను నుండియొ యాంధ్రహితైక దీక్షమై
యత్యధికప్రియత్నమలరారు వచోరమణీపదాంబుజ
ప్రీత్యయ మొప్ప తావకసుభావము నెంచిన మేటులొప్పి సా
హిత్య విశారదుండ వను టెంతయు నర్హము కోవిదాగ్రణీ !

శ్రీ మదాంధ్ర విద్యావాచస్పతి - సాహిత్య సరస్వతి
విద్యా వినోద, కవిభూషణ, శతావధాని, విద్వాన్
దోమా వేంకటస్వామి గుప్త.

---

శ్రీ సాగి వేంకటనరసింహము గారు ఎం. ఏ.

పాల్వంచ సంస్థాన భవ్య విద్యాశాఖ
మెవని నిరీక్షణ నెసగువృద్ధి
ఆంధ్ర వాఙ్మయ సేవ నాచరింపగ కార్య
దర్శియై సమితి నిధాన మెవడు
సకల పండిత కవిసంఘమొక్కటఁజేర
నుత్సవంబుల నెవ్వఁడోపి కూర్చు
జయపురాధీశుని సన్నిధి సాహిత్య
మందు విశారదుండయ్యె నెవఁడు

ఎవని కృషిచేత మన్యాన హెచ్చె విద్య
ఒనర నెవ్వడు గ్రంథాలయోద్యమంబు
బ్రోచు నాశర్మ కర్మహా పూజలిచ్చి
సత్కరింపుడు పాల్వంచ సరసులార!

సాగి వేంకట నరసింహము, ఎం.ఏ.,.
మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాధిపతి.

---

## మౌల్వీ ఉమర్ ఆలీషా కవిగారు

కిన్నర కిన్నరల్ విజయగీతముపాడి తెలుంగు భూమికిన్
వన్నెగడించి లాజలు నివాళినిబోసి స్వరాజ్యలక్ష్మి కా
తెన్నుపతాకమెత్తి తన తేజము భారతదాస్య ముక్తికై
పన్నినమెట్టు నెక్కెడు ప్రభాతముగా విలసిల్లుగావుతన్.

మౌల్వీ ఉమర్ అలీషాకవి.

---

పాల్వంచయందలి శ్రీ అశ్వారాయాంధ్రభాషా
నిలయాధ్యక్షులైన
బ్రహ్మశ్రీ కొత్తపల్లి వేంకటరామ లక్ష్మీనారాయణ శర్మగారికి
'సాహిత్యవిశారద' బిరుద సన్మాన సందర్భమున ఏశద్గ్రంథాలయ
పక్షమున సమర్పించబడిన

## అభినందన పద్య కుసుమావళి

శ్రీయుత కొత్తపల్లి కులసింధు సుధామయమూర్తి! 'లక్ష్మినా
రాయణ శర్మ'! నవ్యరుచిరాంధ్ర వధూపద పద్మసక్తభృం
గాయితమానసప్రథిత కావ్యకళారసవేది! ధీచణా!
మా యెద మెచ్చుకోలులివి మైమఱపించిన హర్ష వర్షముల్

దేశము గొడ్డువోయి కనఁదేర్చెడు నాథుఁడులేక, అజ్ఞతా
వేశపుటంధకారమున వెఱ్ఱిగ మున్గుచు తేలుచుం సదా
నాశము నొందుచున్నతఱి నాలుగు మూలలనుండి సూర్య సం
కాశ సుపుస్తకాలయ వికాసముతో దరిఁ గాంచఁజేసితౌ!

చదువదియెల్ల సార్థకము చక్కఁగ నొక్కెడ బోధ సేయు నే
ర్పొదవిన నీదుజీవనము రూపణ జేయును నీ యథార్థతం
పదియునునై దుశబ్దము లపారపరిశ్రమనొంద వాఙ్మయే
చ్ఛ దిశలనాటఁ జేసితివి సారవిహీన మరుస్థలిం సుధీ!

నీ సౌజన్యము నెవ్వఁడే మెఱుఁగు నీ నిర్భాగ్యపుం దేశమం
దా సాహిత్యసభాపతుల్ జయపురాస్థానంపు రాజన్యులుం
శ్రీసాహిత్య విశారదాఖ్య బిరుదశ్రీనిచ్చి భూషించి రీ
మా సంస్థానజనాళి కిద్ది బహుసమ్మాన్యంబె కా ధీమణీ!

త్వాదృశపూజనీయ సహవాసముఁ గొంటను మాదు గ్రంథశా
లాదృతివన్నెకెక్కె, బహుళాంధ్రవిశారద దర్శనంబు నా
మోదమెలర్పఁ జేసితిమి, భూరిగుణాఢ్య! శుభాస్పదుండ! ని
న్నాదమయీశుగాత్రి కరుణార్ద్రమతిం దిలకించుగావుతన్.

పాల్వంచ,
౧౦–౮–౫౦.

ఇట్లు భాషాసేవకులు,
శ్రీ అశ్వారాయాంధ్రభాషా నిలయసభ్యులు.

రచయిత:—'మృత్యుంజయ'

---

కుకునూరునందలి శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషా
నిలయ సంస్థాపకులైన
బ్రహ్మశ్రీ కొత్తపల్లి వేంకట లక్ష్మీనారాయణ శర్మగారికి
సాహిత్య విశారద బిరుద సన్మాన సందర్భమున ఏకదగ్రంథాలయ
పక్షమున సమర్పింపఁబడిన

## సన్మాన పద్యరత్నములు

శ్రీమీరన్నినుఁబ్రోచు సత్కృపను లక్ష్మీనాథుఁ డబ్జాసనుం
డోముం దీర్ఘముగాగ నాయువిడి నీ కొప్పారు సత్సంతతిన్
బ్రేమన్ హైమవతీకళత్రుఁడు ధరిత్రింగూర్చి రక్షించు ని
త్యామోదంబలరార నెంతయును విద్యాదాస్యదీక్షాపరా!

దేశోద్ధారకుఁ బేర మాదుపురి నర్థి న్నిల్పి గ్రంథాలయం
బాశాంతమ్ములఁ బేరుదెచ్చితివి నీదానిక్కఁపు న్సేవ కా
కాశీనాథుఁడె మెచ్చె నన్న మదినింకన్ జెప్పఁగా నేల నీ
వైశద్యమ్ము గణింప మా వశమె? భవ్యామేయ ప్రజ్ఞోత్సవా!

నిన్నె యుంగని కవులును నీవెఱుంగ
నట్టి కవులున్నవారె? యీ యవనిలోన
ఒక్కరును నీపటానికి నెక్కకుండ
మిగిలిపోనీక వారి యమేయకృపకుఁ
బాత్రిముగఁ జేసినాఁడవు సత్రిమసఁగఁ
జాలు, కుకునూరిలోని భాషాలయమ్ము
నడపినాఁడ వసాధ్యయత్న మునఁ గడఁది
కాసు వెచ్చింపగతిలేని కాలమందె.

ఆంధ్రిభారతి తీర్థ లత్యాదరమున
సరససాహిత్యకళను విశారదుండ
వనుచు గుర్తించి నిను గౌరవార్థయుక్తిఁ
జేయుకన్నను కడునింద సేయువారె
నిజముగా నీదు మేల్గోరు నిర్మలాత్మ
లట్లుకాదేని నిన్నెట్టు లరయు జగము.

ఆయువు సిరి నారోగ్యముఁ
బాయకఁ గరుణించుఁగాత భాషాసేవా
ప్యాయముఁ గల లక్ష్మీనా
రాయణశర్మాఖ్య నీకు రహి భారతి తాఁ.

కుకునూరు
12—1—41.

ఇట్లు భాషాసేవకులు,
శ్రీ దేశోద్ధారక ఆంధ్రిభాషా నిలయసభ్యులు.

రచయిత:—చిలుకునూరి సుబ్బారావు, అధ్యక్షుఁడు.

—

శ్రీ జటప్రోలు సంస్థానమునందలి కొల్లాపుర స్నేహలతా
కవితా సంఘపక్షమున సమర్పించబడిన

## అభినందన మిత్రలేఖ.

ఆనందం బుదయించె నీదుఘనకార్యంబుల్ విలోకింప వి
ద్యానైపుణ్యముగాంచి బోధనకళావ్యాసంగ మెంతేని వి
న్నాణం బొప్పఁగఁజేసినాడ విలఁ బ్రిజ్ఞారేఖ లేపార ల
క్ష్మీనారాయణశర్మ! శోభిలుము లక్ష్మీశ్రసత్కృపాదృష్టిచేఁ.

'కిన్నెర' పత్రికాకృతి సుకీర్తికిఁ దావలమయ్యె నిద్ది భా
షోన్నతికిన్ బ్రచారమున కూఁత; భవత్కవితా ప్రభావముల్
తిన్నగఁజూచువారలకుఁ దేటపడున్ గద దానిలోన మీ
రన్నిఁట ధన్యవాదముల కాదృతిఁ బాత్రతఁగాంచినా రహో!

మీకృషిగొప్ప దాటఁబుడమిన్ జయమెంతయుఁగాంచినారు మీ
పాకట జీవయాత్ర సుకరంబుగ సాగుచునుండు వేఱుగా
వాకొననేల? మీప్రతిభ వాడల వాడలకెక్కెనింతటన్
జేకురు సద్యశోధనము చెప్పఁగనేల విశేషభాగ్యముల్.

వక్రపథంబు నూనక సెబాసని పెద్దలు మెచ్చురీతిగా
సక్రమమొప్ప భాష కనిశంబును జేసెదు నీదుసేవలన్
విక్రమదేవవర్మ పృథివీపతి మెచ్చుటయే విశేష మా
చక్రికృపాకటాక్షపటు సంపద నీయెడ నుండె మిత్రమా!

ఆంధ్రవాఙ్మయ సమితికత్యంతభక్తి
సేవఁజేసి పుణ్యంబు నార్జించినావు

కీర్తి నాల్గుదిక్కులకుఁ బ్రాకెను బిరాన
నింతకంటెను భాగ్యంబదేది చెపుమ.

మానవజన్మ ముత్తమము మాటలు వేయివచింపనేల? య
ద్దానఘనంబుగాదె వసుధన్ బురుషాకృతిఁ గాంచుటన్న నా
పైనఁగవిత్వమన్న నిలపైగల విద్యలలోన నుత్తమం
బైనదిగాన దానిఁగనుటన్న సమస్తముగాంచుటే సఖా.

కవియగువాఁడు గన్పడిన గౌరవమొప్పఁగ నాదరించు నీ
దువిభవమెంతఁగాఁ బొగడుదన్ వినుచుంటిని పెద్దవారు సం
స్తవములు నిన్నుఁగూర్చి పలుసారులుజేయుచునుండమిత్రమా!
యవిరళభక్తి తత్పరుఁడ వంట నికే నుడి నీకుఁ గావలెన్.

ఏలాకో మాటమాట కెదనెంతయు సంతసమబ్బు నీదు గ్రం
థాలయమున్ గవిత్వమును దద్దయు నెంచుచునుండు వేళ నీ
శీలమె సర్వసౌఖ్యములు చేకురఁ జేయు శుభం బొసంగు వాక్
శ్రీలకు సిద్ధిఁగూర్చుఁ జిరకీర్తియు నిచ్చును మిత్రరత్నమా!

పాల్వంచ సంస్థానపతి కృపాప్రాభవ
స్ఫూర్తిచే నీకు సత్కీర్తివచ్చె
నాంధ్ర వాఙ్మయసేవ లనిశంబుఁ జేసెదు
భక్తియే మీకుఁ బావనతఁ గూర్చె
సంస్థాన ప్రజలచే సన్మాన పత్రిక
గాంచుటన్ జేసి భాగ్యంబు గలిగె
విద్యాగురుండవై విఖ్యాతి బొందుటన్
జేసి పుణ్యంబు నార్జింపనయ్యె

గవివి; విద్వాంసుఁడవు; గొప్ప ఖ్యాతిఁ గాంచి
నట్టివాఁడవు; గాన భాషాభివృద్ధి
ప్రబలుచుండె భద్రాచల ప్రాంతమందు
నీ వొనర్చెడు సేవచే నే_స్తకాడ!

కీర్తిఁగఁజేసి లోకమునకున్ వచియింపఁగలట్టి సంగతుల్
బా_త్రిగఁ గానరావు; తమపుణ్యము గొప్పదిగాన నింతకున్
హ_త్తగఁ గల్గినార లిల నాంధ్రకవిత్వపు త_త్త్వబోధనల్
జి_త్తము పల్లవించుఁ గద చేసిన మీ కృషియత్నముల్ గనన్

పావన గౌతమీజలము వారక తాఁవుచునుంట యేమొ! గో
దావరియొడ్డునన్ నిలచు ధన్యతఁగాంచుటఁజేసి యేమొ! సం
భావనఁ జేయఁగాఁ దగిన మాధురి తావక సత్కవిత్వ రే
ఖావళిలోఁ గనంబడు సఖా! తమ రెంతటి ధన్యమూ_ర్తులో.

స్తుత్యములైన కావ్యములు సొంపుగఁ గూర్చిన వాఁడవౌట,బల్
'సత్యగుణాక్షమాది బలసంపదఁ గాంచినవాఁడ వౌట సా
హిత్యవిశారదుండ'వని యెన్నిరి పెద్దలు నిన్నుఁగాన నౌ
చిత్యము గొప్పదయ్యెఁ జిరజీవిగ వర్ధిలుమోయి మిత్రమా!

ఇట్లు విధేయులు,

కొల్లాపురము,
12—1—41.

స్నేహలతా కవితా సంఘసభ్యులు
శ్రీ జటప్రోలు సంస్థానము.

రచయితే:— వాజపేయ యాజుల రామసుబ్బారాయుడు బి.ఏ.
స్నేహలతా కవితా సంఘాధ్యక్షుఁడు.

అశ్వారావుపేటయందలి శ్రీ వేంకట్రామనృసింహరాయాంధ్ర భాషానిలయ పక్షమున సమర్పించపడిన

# అ భి నం ద న ప త్రి ము

మహాశయా!

తాము ఆంధ్రభాషామోషకు జేసిన యమూల్యసేవను గుర్తించి తమను 'సాహిత్యవిశారద' బిరుదముతో సత్కరించిన శ్రీ ఆంధ్రభారతీతీర్థులు సాహిత్యసామ్రాట్టు శ్రీ శ్రీ జయపురాధీశ్వరులకు మా విధేయతాభివందనములు.

ఆర్యా!

బీడుపడియున్న ఈ ప్రాంతమున అనేక కష్టనష్టములకు సహించి ఆంధ్రిభాష నంకురార్పణము చేసిన మీ కృషికి కృతజ్ఞులము.

సుజనవిధేయా!

కప్ప పద్మసౌరభముం గ్రిహింపజాలని యట్లు మిమ్మర్థము చేసికొననేరని యసూయోపాసకులకు మా న్యక్కృతులు.

సాహిత్యవిశారదా!

ఇట్లే ముందును ఆంధ్రభారతికి సూడిగమొనర్ప ఆయురారోగ్యైశ్వర్యోత్సాహశక్తులను మీకు ప్రసాదించుటకు వాగ్దేవికి మా నమోవాకములు.

ఇట్లు భాషాసేవకులు,

అశ్వారావుపేట, ౧౦–౪–౧౩౫౦. } శ్రీ వేంకట్రామ నృసింహరాయాంధ్ర భాషానిలయసభ్యులు, పాలకవర్గము.

బూర్గుంపాడు పౌరుల పక్షమున సమర్పింపబడిన

## అభినందన పత్రిము

ఆర్యవర్యా!

ఆంధ్రిభాష యననేమో, ఆంధ్రిదేశ మననేమో ఆంధ్రులన నెవరో యెరుగక అజ్ఞానాంధతవలన తమ్ముఁదాఁదెలిసి కొనలేని స్థితిలోనున్న మాపాల్వంచ సంస్థానమునకు తాము విచ్చేసి పదునై దేడులనుండి భాషావాఙ్మయసేవ లొనరించు చుండుట మా పాల్వంచ సంస్థాన ప్రిజలభాగ్య మనవచ్చును.

మహాశయా!

ప్రిథమమున అమరవరము, కుకునూరులందు విద్యాబోధకులుగానుండి అచట శ్రీ ఆంధ్రి గౌతమీ ఆశ్రిమము, శ్రీ దేశోద్ధారక ఆంధ్రిభాషా నిలయముల స్థాపించి సంస్థాన గ్రింథాలయోద్యమమునకు మార్గదర్శకులై ప్రిజల సమాదర మును బొంది విద్యాధికారులై మా బూర్గుంపాడుకు విచ్చేసి అచటి గ్రింథాలయమును పునరుద్ధరించి పౌరుల యామోద ప్రిమోదముల నందియున్నారు.

అచటనే ఆంధ్రివాఙ్మయ సేవాసమితిని స్థాపించి వాఙ్మయసేవఁ జేయుచు ననేక విద్వాంసుల రప్పించియు, వారి మహోపన్యాసముల వినుటకును, గనుటకును సదవకాశము లభింప జేసినందులకు మి మ్మెంతయు నభినందించుచున్నాము.

కార్యనిర్వహణదక్ష !

తా మిపుడు సంస్థానమునకు రాజధానీనగర మగు పాల్వంచలో నున్నను యథాపూర్వముగ భాషావాఙ్మయ సేవలఁ జేయుచు నితోధికముగ ప్రజాప్రబోధము కలిగింతురు గాక యని కోరుచున్నాము.

మాననీయా !

మీ పరిశ్రమను గ్రమనించి శ్రీ భారతీతీర్థవారు 'సాహిత్యవిశారద' యను బిరుదొసంగి మిమ్ము సత్కరించినందులకు శ్రీవారి కెంతయు కృతజ్ఞులము. ఆ బిరుదమున కీ సంస్థానమున తాము చేసిన భాషాసేవయే తార్కాణ మని మనవి చేసికొనుచున్నాము. మీవంటివారికి చేదోడువాదోడుగా నుండి సర్వదా సహాయపడుచు ధన్యులము కాగలమని విన్నవించుకొనుచున్నాము. మీకు సత్సంతతిని దీర్ఘాయురైశ్వర్యముల నొసంగుగాక యని పరమేశ్వరుని వేడుకొనుచున్నాము.

పాల్వంచ,
౧౦-౮-౫౦.

ఇట్లు విన్నవించు విధేయులు,
బూర్గంపాడు పౌరులు.

---

భద్రంకోటలోని శ్రీ బ్రహ్మనందాంధ్రభాషానిలయ పక్షమున సమర్పించబడిన

## సన్మానపత్రము

సేవాధురీణా !

తమరు ఆంధ్రభాషాజ్ఞానశూన్యం బగు ఈ మన్నెపు ప్రాంతములకు విచ్చేసి, పలుకష్టముల సహించి గావించిన భాషా

సేవ మే మెన్నటికిని మఱువజాలము. భాష, భాషాసేవ, గ్రంథాలయసంస్థాపన మన నెద్దియో యెరుంగని మా కెల్లరకు భాషాసేవ నొనర్ప నుత్సాహ ముద్దీపింపజేసిన నిజమైన భాషా సేవకులు తమరే. అట్టివారిని ఎంతయని కొనియాడగలము? ఈ వెనుకబడిన ప్రాంతమున తమరు తప్ప నింతటి భాషాసేవ నొనర్చినవారు, ఇంతటి యుత్సాహవంతులు, కార్యదీక్షా తత్పరులు వేరొకరు లేరని నుడువుటయం దతిశయోక్తి యేమియు లేదు. ఎంతటి భాషాసేవ సల్పనిదే ఆంధ్రభారతీతీర్థవారు తమ కీ సాహిత్యవిశారద బిరుదమును ప్రసాదించియుండరు! ఇది సామాన్యవిషయమా! మాకు నెలవయిన మా ప్రాంచ సంస్థానమున నింతటి భాషాసేవకుని గలిగియుండుట మిగుల గణనీయము. అట్టి మహత్తర సత్కీర్తి లభించుటను గురించి మే మందరము గర్వించు చున్నారము.

మహాశయా!

ఇంతటి తమసేవ నభినందించి మా కృతజ్ఞతల వెల్లడించుట కేర్పడిన ఈ సభాముఖమున మా గ్రంథాలయపక్షమున తమకు 'పండితారాధ్య చరిత్రము'ను బహూకరించుచు తమచే నింకెంతయో భాషాసేవ యొనర్ప పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్య విజయంబుల ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాము.

రుద్రకోట, ⎫ ఇట్లు విన్నవించు భాషాసేవకులు,
౧౦-౮-౫౦. ⎭ శ్రీబ్రహ్మానందాంధ్ర భాషానిలయ సభ్యులు.

---

పాల్వంచసంస్థాన పూర్వవిద్యార్థి సంఘపక్షమున
సమర్పింపబడిన

## అభినందనపద్యములు

సాంద్రి గోదావరీ స్వాదుజల తుషార
పూరముల పునీతంబైన పుణ్యభూమి;
కోసలాధీశ్వరుఁడు తండ్రికోర్కి దీర్ప
అవనిజయు ననుజన్ముడు ననుగమింప
మోదగరిమను చనుదెంచి సాదరమున
స్వాగతమ్ము నొసంగిన భవ్యభూమి
రామదాస శేఖరుఁడు భద్రాద్రినిలయు
దేవళాగ్రింబునఁ సముత్తేజ గరిమ
నలరు చక్రముంగాంచి లాస్యము నొనర్చి
జానకీనాథు భజనంబు సల్పుచుండ
నతని గళమున తనగళ శ్రుతిని గలిపి
తేనె లూరంగ పాడిన దివ్యభూమి
ఆంధ్రి భూపాలవరుల ఛత్రాధిపత్య
మునకు నంజలి ఘటియించి భోగములకు
నాలవాలంబునై దనరారు భూమి
అదియె పాల్వంచసంస్థాన మనఁగబడును!

* * * *

అచట విద్యాధికారంబునందు కొత్త
పల్లి శర్మాభిధానుండు బరగుచుండు

ఆంధ్రభాషాభిమానియై యలరు నతడు
ఆంధ్రవాఙ్మయ సేవావిహారు డతడు
స్థాపనాచార్యు డాంధ్ర గ్రంథాలయముల
కత డహహా! మూర్తమైనట్టి యాంధ్రసేవ.

* * * *

హాయి దళుకొత్త పులకీకృతాంగు లగుచు
కెరలు కవికుమారులు కావ్యగీతములను
అతనిచే నిర్మితంబై మహత్వగతిని
వెలయు 'కిన్నెర' మీటుచు విశ్వమోహ
నముగ నాలపించిరి తన్నినాద పంక్తి
నేటికిని కర్ణపుటముల న్వినగ బడును
ఆ నినద పరంపర గాలిలోన గలసి
భారతీ తీర్థవారి శ్రవణపుటముల
దవిలినంతనె తన్మయత్వంబు నొంది
శర్మమునను 'సాహిత్య విశారద' యని
బిరుదిడి యతనికీర్తి గావించినారు.

రచయిత:—వనం గోపాలకృష్ణరాయకవి,
కమలాపురం.

---

"అతఁడే మాదు పూర్వపుణ్యాన మాకు
కుక్కనూరున నాచార్యకుండయి చదు
వులలరగ వచ్చె మూఢతఁ దెలియమైతి
మప్డు శారద మెచ్చిన యనఘుఁడితఁడ.

టంచు నిట్లు సభా ముఖమందు మేము
పూర్వ గౌరవ భావ ముప్పొంగి పొంగి
హృదయకుహరంబు వెలునడి నుదముగరిమ
దెల్ప, చందురునికొక్కటి నూలుపోగె
అన్న సామెత యున్నదే యెన్నటికిని
కాన నేడిట్లు భక్తి సత్కరణమునను
ధన్య జీవుల మయితిమి తథ్య మిదియె.

ఇట్లు తమ శిష్యులు

౧౦-౮-౩౦ పాల్వంచ. — పూర్వ విద్యార్థి సంఘము. పాల్వంచ సంస్థానము.

౫

ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి

సభ్యుల ప్రశంసలు

# పరిచయము

శ్రీ కందిమళ్ల వెంకట రామారావుగారు.

శ్రీ కొత్తపల్లి వేంకట రామలక్ష్మీనారాయణ శర్మగారిని దాదాపు ఇరువదైదేండ్లనుండి ఎరుగుదును. బహుశః నాకు సహాధ్యాయి కాకపోయినా నాసతీర్థ్యులై యుండటంలో సందేహం లేదు. ఆ కాలంలోనే ఆయన ప్రయత్నాలు ప్రచారాలు తక్కువగా వుండేవికావు. కాని ఆ విద్యార్థ్యవస్థ నాటి ఆయన తలంపు లన్నీ ఆయన్ని పిచ్చినా డనిపించేట ట్లుండేవి.

పదహారేండ్ల క్రింద మనప్రాంతంలోని అమరవరంలో ప్రవేశించి ఏదో ఆశ్రమం యేర్పర్చుకొని విద్యావ్యాపకం చేస్తూ అచ్చటి నుండి కుకునూరుకు మకాం మార్చుకుని దేశోద్ధారక ఆంధ్రభాషానిలయంస్థాపించి అచ్చటి స్థానికులకు ప్రోత్సాహకులై వారిసహాయసానుభూతులచేతను, కవి, పండితుడు, పత్రికాధిపతి, ధనికుడు అనే ప్రతివ్యక్తినీ అర్థించడంచేతను భాషా నిలయాన్ని ఎంతో వృద్ధిచేశారు. దైవవశాత్తు ఆ గ్రంథాలయ సర్వస్వం వీరి సర్వస్వం నిండు వేసంగిలో అగ్నిహోత్రుడారగించేసి నప్పటికి తిర్గి వీరు నడుములు బిగించి ఆందోళన సాగించే టప్పటికి దేశంలో వారంతా సహాయపడగా తిర్గి ఆ గ్రంథాలయాన్ని పునరుద్ధరించారు.

అసలు విద్య అంటే యేమిటో అందులో తెలుగెటువంటిదో బొత్తుగా తెలియని యీ ప్రాంతాన ఆ రోజుల్లో ఆంధ్రభాషాభివృద్ధికై పెద్ద ప్రబోధం చేసి ప్రచారం సాగించారు. ఆనాడు భాషా ప్రచారమంటేను సామాన్య విషయం

కాదు. నోరువిప్పితే అగాధంలో పడిపోవలసిందే. కలం పట్టుకుంటే కష్టాలకు స్వాగతం యివ్వవలసిందే. అయినా వార్షికోత్సవాలూ మానలేదు, వర్ధంతులూ విడిచిపెట్ట లేదు. అర్థబలమూ అంగబలమూ లేని యీ పిచ్చిబ్రాహ్మణుు "గడ పైన ఆడే గారడీవాని" వలె ఎప్పుడు తలక్రిందై పోతాడో! ఎప్పుడు శృంగభంగ మవుతుందో అనుకునేవాణ్ణి. బహుశః ఆయన 'మనకు శృంగమే లేనపుడు భంగ మెలా అవుతుంది' అని తృప్తిపడేవా డనుకుంటాను.

ఇటీవల పరిస్థితులలో యత్కించిత్తు మార్పుకల్గింది. శర్మగారు బూర్గుంపాడు నివాస మేర్పరచుకోవలసివచ్చింది. అక్కడ మళ్ళీ ఒక భాషాసంస్థను లేవదీశారు. దానికి ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి అని పేరుపెట్టారు. దానికోసం కవులను కథకులను, వ్యాఖ్యాతలను, విమర్శకులను, పండితులను, వదాన్యులను కూడగట్టారు. గ్రంథం సాగిస్తున్నారు. పిచ్చో మంచో గాని ఏదయినా ప్రయత్నమంటూ మొదలెడితే ఆసీమాంతం చేసి విడవాల్సిందే గాని మధ్యకాలంలో విసిగి విడిచిపెట్టే ఆచారం ఆయన మెరుగనే మెరుగడు.

ఇంతకూ మన ప్రాంతంలో యేమాత్రమైనా ఆంధ్రభాషకు అభివృద్ధియేర్పడింది అని తలచేవాళ్లెవరైనా వుంటే కర్తృత్వం శర్మగారికే అంటకట్టాలికాని ఇతరుల కా హక్కు లేదని ఘంటాపథంగా చెప్పకతప్పదు. మన ప్రాంతంలో భాషానిలయమంటూ వుందీ అంటే అందుకూ ఆయన్నే ప్రోత్సాహకుణ్ణిగా నిర్ణయించాలి.

శర్మగారు వాచాశూరత్వంలేని క్రియాశూరుడు. కను కనే 'సాహిత్యవిశారద' బిరుదానికి అర్హుణ్ణిగా యెంచి ఆంధ్ర భారతీతీర్థులు సాహిత్యసమాశ్రిట్టు జయపురాధీశులు గౌరవిం చారు. ఇందుకు ఈర్ష్యాళులు కొందరు మరోకలాగు అపవ దించినట్లు విన్నాను. బిరుదిచ్చినవారు సర్వశక్తులూ కలవారు. ఇట్టిస్థితిలో ఆక్షేపకుల ఆక్షేపణలో అసూయాతత్పరత్వలక్షణం ద్యోతకమవుతుంది గాని స్వీయపాండిత్యస్ఫోరకంగా గాని ఆధిక్య ప్రతిపాదకత్వంగాగాని (నిజం గ్రహించగల) లోకాన్ని మోసం చేయటాని కనుకూలించదు. నిజంలో మన ప్రాంతమందు నిఘంటువులనుండే ఆంధ్రపదము జారిపోయిన రోజులలో మనల మేల్కొల్పి ఆంధ్రభాషాభివృద్ధి యొనర్ప ననేక కష్టములకు సహించి చాలవరకు కృతకృత్యులయిన శర్మగారిని మనము గుర్తింప లేక పోయినను శ్రీభారతీ తీర్థ వారొనరించిన సత్కారానికి మనమభినందించుటనైనా కొంత వరకు మనవిధిని నెరవేర్చినట్లే. ఇందులకై మనప్రాంతములోని వివిధగ్రంథాలయములవారు, విద్యాసంస్థలు, సమితివారు వివిధ రీతుల అభినందన సమావేశం జరుప యత్నించుట శ్లాఘా పాత్రం. అందుల కభినందనసభ కధ్యక్షులుగా శ్రీ డివిజన్ ఆఫీసరుగా రుండ నంగీకరించటం మరీ సంతసం. ఓర్వలేమిచే ఎవ్వరెంత అసూయపడ్డా శర్మగారభివందనములకు సర్వవిధ ములా అర్హులు. "చక్రవాకము విలపించు నని చంద్రుడు చంద్రికల వెదజల్లడా!"

ఈ సందర్భంలో శ్రీ శర్మగారి అభినందనగౌరవార్థం

నేను రు 50/- లును, వినాయకపురం పటేలు భూస్వాములు నగు శ్రీ నల్లపువీరయ్యగారు రు 25 లును సన్మాన విరాళంగా పంపిస్తూ మా కృతజ్ఞతను ఈ విధంగా వెల్లడిస్తున్నాము.

శర్మగారి భాషాపిపాస ఒకనాటికి తీరేదికాదు. ఇటు వంటి వాళ్లు కొందరక్కడక్కడనైనా వుంటేగాని భాషా వ్యాప్తికి అవకాశం లేకుండా పోతుంది గనుక ఇట్లే ఇతోధిక మైన భాషాసేవ చేయుటకు శర్మగారికి ఆయురారోగ్యాలు కలుగజేయాలని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను.

అశ్వారావుపేట, }
౧౦-౮-౫౦. } కందిమళ్ళ వేంకటరామారావు.

---

# కృతజ్ఞత.

## మిత్రయుగ్మము

శ్రీనాథుం డురువిక్రముండు కరుణాశ్లిష్ట ప్రభావుండు వి
జ్ఞానానంద ధనప్రదాత కుటిలాచార ప్రచారోద్ధురా
నూనపాపభవహర్త దీనజనసందోహార్థసంధాత ల
క్ష్మీనారాయణశర్మ గాచుత శుభశ్రీ నిచ్చి యత్యంతమున్
కవివా కావు, కడిందిపండితుడవా - కావింక నేమైన భా
ష విశేషమ్ముగ వృద్ధిసేయదగు నీసామర్థ్య సంపద్విలా
స వరిష్ఠత్వ మనన్యదుర్లభ మనన్ సందేహ శూన్యంబె యిం
కెవ రేమన్నను నీవు ధన్యుడవె యం చేమెంతుమెం తేనియున్.

న్యాయనిర్ణేతముత్తార్ణ వాబ్జుండు సు
బ్రావుచూపిన గౌరవమ్ముకన్న
ఆంధ్రాంగ్లభాష మహాబ్ధులదర్చ్చిన
రామలింగారెడ్డి ప్రేమకన్న

అలకాశివిశ్వవిద్యాలయోపాధ్యక్షుఁ
డనఘ రాధాకృష్ణు గణనకన్న
సర్వజ్ఞ వేలూరి సాగరహిమభాను
శివరామశాస్త్రియాశీస్సు కన్న
అపరభోజుఁడు విక్రమ నృపతితిలకు
నాదరానికి గుఱియైన యంతకన్న
నెచ్చు లేమియుఁగావు మా మెచ్చుకోలు
కమ్రగుణశాలి! మాకృతజ్ఞతలెకాని.

తెలిసినవారు భారతికిఁ దీర్ఘులుఁగాన విశారదుండ వం
చెలమని గౌరవింపఁగ నహీనమతి న్నిను సాహితీకలలఁ
దెలియ కజాగళస్తనసతీర్థ్యులు కొందఱదేదో తీరుఁగా
బలుకుదు రంత నేమగుఁ బ్రభాకరుపై మనుఁ జల్లునట్లుగన్.
స్వాగత మిచ్చి సైచితె సెబాసు! దురంతపుఁ గష్టనష్టముల్
బాగుగ సాయమింతయునుఁ బొల్పడకుండినయప్డె! యిష్టా భా
షాగురుతామహత్త్వగుణసంపదుదారులు మేటిభావుకుల్
నేగి ఘటిల్లనీరు శుభశీలురు తోడయి లేశమేనియున్.
కావున నీదుయత్నము లఖండములై కొనసాగుఁగాత! సు
శ్రీవిపులార్థ సంపదలు చేకురుఁ గావుత! నీకు, నెప్డు వి
ద్యావినయాది సద్గుణకదంబము నిన్వరియించు గాత! దు
ర్భావులు నిన్నహింపని యభాగ్యులు హ్రీవహియింత్రుగావుతన్.

ముకుంద రామమూర్తి,
చిలుకునూరి సుబ్బారావు.
(ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి కార్యనిర్వాహక సభ్యులు,)

---

# అభినుతి.

## శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులుగారు.

కర్తృఫలంబు కారయితగాంచును సామని చెప్పికొందుఱి, వా
క్స్ఫూర్తము లంచు నెన్నఁదగుఁ గోవిద సత్కరణంబులందుఁ జే
రార్తినిఁ బొంది కార్యకరణాతిశయప్రియమోద చిత్తనై
వర్తము నొందుఁ గొత్తపలి వంశజు శర్మ నుతింపఁ జెల్ల దే !

సత్త్యము ధీవిశేషము, విశుద్ధమనః పరిలీఢ దివ్య 'సా
హిత్య విశారదత్వము', కవీంద్ర కృతాదరణ క్రియాతిసౌ
మత్యము, ధర్మకృన్నిరుపమానమహావ్యవసాయబుద్ధి, సా
హిత్య విశారదాఖ్య బిరుదేష్యఁ బొనర్చుట లింక నబ్రమే ?

మా మిత్రుం బొకరుండు భద్రినగరీ మార్గానఁ బొల్వొంచలో
శ్రీమద్వాఙ్మయసంఘరూపమున గీర్దేవీ సమారాధనల్
భూమోల్లాసితఁ జేయు నంచును మనస్ఫూర్తిం బ్రశంసించు కొం
చామోదింతుము, శర్మకంటె ఘనవిద్యాసేవకుం డుండునే ?

కవియో కాఁడటఁ బండితుండో సరియే కాఁ డర్థవంతుండో కా
డవిజయ్యంబగు సద్యశఃకలన దిగ్వ్యాప్తంబు కానేల ? ద
త్సవికాసార్ద్ర ఘనాంతరంగమధుసించద్భావమాధుర్యమే
నవసాహిత్యసరస్వతీహృదయదఘ్నంబైన పూజాంకమా.

తన కావించిన దానికిఁ ఫలము నిత్యం బొందు నొక్కండు, నొ
క్కనికిఁ దత్ఫలపాక వేళకును వేగ్రై వచ్చు దుర్దైవ ఘ
ట్టనఁ బొల్లైచను భోగభాగ్య,మది యట్లై పోమె 'కుసుమ్నర'నో
మినగ్రంథాలయ,మాగతిఁ జెడునో సామిత్యంబు వైభోగమున్

కై కొని కూపకుడ్యములు కట్టెడు వారలు క్రిందుమీదికిన్
బోక స్వభావమే యగును బుణ్యము కర్మఠతా విధేయమై
జోక వహించు శర్మపదు క్షోభలు సర్వము కూపకారి కృ
త్యాకృతియయ్యెఁ గిన్నెరలు హావళి మ్రోగును సాహితీపథిన్

సమితియొ వ్యక్తియో పరమశక్తికి మూలము? వ్యక్తి శూన్యమా
సమితికి నుండునే స్థితియు? శక్తిమదగ్ర్యుఁడు వ్యక్తియే ప్రజన్
శమిత సమస్తకిల్బిష ప్రశస్త పదంబున గొంచుఁబోవు, నీ
శ్రమమె జగానఁ బొందెడి నఖండజయంబు నిరస్తదోషమై.

సృష్టికి దేశకాలములు శ్రేయముఁ గూర్చెడి, నా యుగమ్మునన్
స్రష్టయు మేము మేమనిన సాగునె? శర్మయు బూరుగుమ్మ పా
డిష్టము కల్మి నీ సమితి యేత్రైజఁగాంచెను శర్మలేక సం
సృష్టియు లేదు, వాఙ్మయవిశిష్టమహంబులు లేవు చూడఁగన్

ఇంత నిజాము రాజ్యమున నెంతకుఁ జూచిన సత్కవిత్వసా
మంతము మెచ్చఁగల్గిన సమర్థులు తక్కువ, నే నెఱుంగుదున్
వింతలు పోకడల్ కలుగు నెక్కుఱు పాండితియే జయించెదున్,
నంతయొ కొంతయో కవనశోభ నెఱింగిన శర్మ నెన్నెదన్

ఎచ్చటనున్న నల్వురును నేదో చమత్కృతి నొంద సాహితిన్
బొచ్చెముకాని యాదరము పుట్టగ సందడి నూలుకొల్పుచున్
బిచ్చము పెట్టజాలకయుఁ బెట్టెడు కొంపలు చూపుచుండు నీ
సచ్చరితున్ నుతింపఁదగు శర్మను బ్రాహ్మపదార్చనారతున్.

శ్రీయును ధీయును దీర్ఘం
బాయువుఁ బుత్రాది భాగ్య బంధురతయు శ్వా
శ్వైత్రియసమునొంది శర్మయు
భూయ స్సౌఖ్యంబులందుఁ బుడమిని నిచ్చల్.

ఉభయభాషా ప్రవీణ, విశ్వనాథ వేంకటేశ్వరులుః
(సమితి గౌరవసభ్యులు)

---

# శు భా ం జ లి

శ్రీ పన్యాల వెంకటరంగనాధరావుగారు

మా విద్యానగరాన భారతిని సన్మానింపఁగా, పెద్దలం
తా విచ్చేసి జయప్రదమ్ముగ సభల్ సాగించుకొన్నప్పుడే
నీవైనావు విశారదుండవుగ సాహిత్యమ్మునందంత క
న్నా వేఱేమిఁక గావలెఁ శుభమగుల్ సాహిత్యలోకమ్మునన్.
అల గోదావరితీరమందు జనన మ్మైనట్టి మా వాఙ్మయ
మ్మలరెఁ నేటికిన్ విశారదునిఁ జేయన్ జేసి, నిండైన స
త్కళలన్ విక్రమదేవుఁడే భళియనంగా కాకలీకూజిత
మ్ములు మా కోకిల లాలపింపఁగ సతమ్ముల్; కొత్తపల్లీశ్వరా!

ఆంధ్ర వాఙ్మయసేవ సభ్యావళీ స
మర్పిత శుభాంజలుల పుంజ మందికొనుము;
సాహితీ ప్రపంచమున విశారదుండ
నైతి వీ నాడు ధన్యుఁడవైతివోయి!

— పన్యాల వేంకట రంగనాధరావు,
(ఆంధ్రవాఙ్మయ సేవాసమితి కార్యనిర్వాహక సభ్యుడు)

---

# చదివింపులు.

## శ్రీ చంద్రమౌళిశాస్త్రిగారు.

మంచివాడని పొగడుదు మంతెకాని
నీదు హృదయాన గుప్తమై నిబిడమైన
స్నేహలత సొంపు గన్గొన నేరమైతి
మయ్యా! దుర్బల హృదయుల మగుటవలన.

ఆశల్ నిగ్గులు దేరి - దేశహిత జీవాన్వేషణారంభ వి
శ్వాసోదంత కృతిప్రధాన ఘనదీక్షాబద్ధులై; నాడు-నే
డాశాంతమ్ముల వ్రాసినారు మనవా రాంధ్రత్వనిష్ఠాజయ
వ్యాసంబుల్ తిలకించి మేను పులకింపఁ జేసి నా వీ మముఁ.
చదివింపంగను వచ్చినాడవును ఈ సంస్థాన పౌరాళి నీ
యెదలో తోచెడి మంజుభావలహరీ నృత్యప్రమోదాలకే
హృదిలో మెచ్చులురావు? సాజమిదిసూ! ఇన్నాళ్ళ కిన్నాళ్ళకీ
చదివింపుల్ గొనివచ్చినాము గొనుమా సాహిత్య సాహిత్యుడా!
ఈ నాడైనను నీదు సత్కరణ మబ్బెఁ నేటి కింతే ఘనం
బై నాబోంట్లకు; ఎల్లకాల మటులే ఆంధ్రీపదాంభోజ సు
శ్రీనిష్ఠా మహితాత్మ సేవనలు నీ చిత్తంబులో హత్తు;-ల
క్ష్మీనారాయణ శర్మ చేకొనుమయా స్నేహోక్తు లత్యంతమున్!

ఆంధ్ర వాఙ్మయ సేవాసమాఖ్య సమితి
పేర మమ్ముల నందఱ పేరు గుచ్చి
భారతీదేవి గళవీథిఁ బారవైచి
నావు - ధన్యమ్ములయ్యె మా జీవనములు.

— వ్యాసరచనా ప్రవీణ
బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి,
(ఆంధ్రవాఙ్మయ సేవా సమితి సహాయ కార్యదర్శి)

# అభినందనము.

శ్రీ పెరవలి లింగయ్యశాస్త్రిగారు

నిష్ణాతుండవు సంస్కృతాంధ్రముల నో నిర్ణిద్రకీర్తిప్రభా
జిష్ణుశ్రీక! ఉదాత్తవర్తన! సుహృచ్ఛ్రీ 'లక్ష్మీనారాయణా'!
విష్ణుం డాయువు శ్రీయు సంతతియు నేవేళం బ్రసాదింప నీ
వుష్ణాంశుండునుబోలె నీ వసుధపై నోజస్వివై గ్రాలుమా!

తామరతంపరగా నటు సదాశివుఁడోముత నిన్నవశ్యముం
గోమునఁ దెన్గుబాస యనుఁ గూరిమి కన్నియ నేలుమయ్య ఉ
ద్దామవిచార! సత్త్వగుణధైర్యవిశాల! మహానుభావ! నీ
నామము దేశసేవకుల నామములం విలిఖింపఁగాఁదగుం.

ఆంధ్రభారతీతీర్థ వారాదరమున
నాంధ్రగీర్వాణసాహిత్య మందు నిన్ను
సత్తముఁడంచు మదిగెంచి యార్యవర్య!
బిరుద మిచ్చిరి మీకది బిరుదె! చెపుమ!

లక్ష్మీనారాయణాభిధ! సూక్ష్మమతిని
సంతతానంద మిచ్చుచు శంకరుండు
సాకు నెప్పుడు నాంధ్రభాషామతల్లి
సేవఁజేయంగ 'పాల్వంచ' సీమయందు.

అభినందనాశిషంబుల
విభజింపఁగ రాని భక్తివినయశ్రీలం
బ్రభవించుమైతిఁ గూర్చితి
సుభగంభావుకచరిత్ర! సూడిదగాగం

ఉద్యదాదిత్యునకు నర్ఘ్యమొసగినటుల
విడియఁ బాడతెంచు కొన్నెల గదియఁ జూచి

ప్రీతపోగన్న వాక్యంబు పగిదిగాను
సరససాహిత్య సుకవితావర సుకీర్తి
'లక్ష్మినారాయణా !' మైత్రి పత్కలింప
నందుకొమ్మిదె ! అభినందనాశిషముల.

— ఉభయ భాషా ప్రవీణ
పెరవలి లింగయ్యశాస్త్రి,
(సమితి సభ్యులు)

---

జయపురాధీశ దత్త ప్రశస్త బిరుద
శోభితుడవంచు నిన్ను మెచ్చుకొననేల?
సత్యముగనె సాహిత్య విశారదుడవు!
సరసుడవు కో. వె. రా. ల. నా. శర్మ నీవు.

— చిలుకూరి శ్రీరాములు,
(సమితి గౌరవసభ్యులు)

---

సాహిత్య విశారదా !

మీరు వాఙ్మయ కర్షకులు. మీ కృషి సారవంతము లైన గోదావరీ భూముల నెక్కువ ఫలించి ఆంధ్రుల ఫలాస్వాదకుల జేసినది. ఇట్లు జన్మభూమి ఋణమును పరిష్కరించుకొనిన పుత్రులలో మీరును పరిగణ్యులు. మీ పుట్టువు చరితార్థము. మీ కృషిని గుర్తించి మీకు 'సాహిత్య విశారద' యను బిరుదమును సత్కరించిన 'ఆంధ్రభారతీ తీర్థ' వారి యెడల ఆంధ్రులు కృతజ్ఞులు.

—శతావధాని హరిరామ లింగశాస్త్రి.
ఉభయభాషా ప్రవీణ,(సమితి గౌరవసభ్యులు)

మీరు 'సాహిత్య విశారదు' లగుట కడుంగడు ప్రశంసనీయము. మీ సేవయే మిమ్ము ముందునకు తీసికొని రాగలదు.

— కొమరగిరి నారాయణరావు,
(సమితిసభ్యులు)

---

తమ నిరంతర భాషాసేవయే తమ సన్మానమునకు చిహ్నమైనది. పండితసన్మానము జరిగినందులకు భాషాసేవకుల కానందము కలుగకపోదు. భాషాభివృద్ధికై భగవంతుడు తమ కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి గలుగజేయుగాత. ఆంధ్రమాత ఆశీర్వదించుగాత!

— రేమిడిచర్ల వేంకటకృష్ణారావు,
శ్రీ సిద్ధమల్లేశ్వరాంధ్ర భాషానిలయ కార్యదర్శి,
రేమిడిచర్ల.
(సమితిసభ్యులు)

---

తమకు అప్రయత్నముగా లభించిన బిరుదముగురించి మిక్కిలి సంతసమైనది. ఈశ్వరుఁడు ఇంకను మహా బిరుదములొసంగి తమ భాషాసేవను వృద్ధి నేయించుగాత యని ప్రార్థించుచున్నాను.

— గొట్టిపర్తి సుబ్బారావు,
హైకోర్టువకీలు, సింగరేణి కాలరీస్,
(ఆంధ్రవాఙ్మయ సేవాసమితి ఉపాధ్యక్షులు)

# నిబంధనలు

ప్రధానోద్దేశము:— ఆంధ్రవాఙ్మయ సేవాభిలాషు లెల్లరు సమితి యందుఁజేరి వాఙ్మయాభివృద్ధికై పాటుబడుట.

కార్యవిధానము:— వాఙ్మయసేవక చర్చలు, సమావేశములు, గద్య పద్యరచనలు, విమర్శనము, ప్రచార ప్రబోధములు, వర్ధంతులు, కవిగాయకాది సమ్మేళనములు జరిగించుట, గ్రంథపత్రికా సామగ్రిని సేకరించుట, పరిశోధించుట, సమితిపక్షమున, వార్షికసంపుటములను, సాహిత్యగ్రంథములను వెలువరించుట, విక్రయించుట.

ఇందుకు రాజకీయములతో గాని ప్రత్యేక మేదేని మతముతో గాని సంబంధించియుండగూడదు. ఈ సంస్థ కేవలము సాహిత్య ప్రమేయము కవితా గోష్ఠి కలది.

సభ్యత్వము:— సమితి యుద్దేశముల నంగీకరించి, సాహిత్యరచనలు చేయఁగలిగి, కావ్యపరిశీలన, గ్రంథరచనాభిలాష, కవితాదరణముల పెంపొందించుచు, సంఘబలమును చేకూర్చుచు సంవత్సరమునకు రు ౩ లు చందాచెల్లించు వారు సమితిసభ్యులు. సమితిచే గౌరవపురస్సరముగ నంగీకరింపబడిన పండిత కవులు గౌరవసభ్యులు వీరెల్ల రొకసాహిత్యకుటుంబముగ తీనరి పరస్పరానురాగముతో వాఙ్మయ సేవకు గడంగవలయును. వీరందరి సమాలోచనలతో కార్యదర్శులు కార్యక్రమమును నిర్వహింతురు.

పోషకభృతి:—పై వారాంధ్ర భాషా వాఙ్మయాభివృద్ధులకు జరిగించు ప్రయత్నములకు మహోదారులగు ఆంధ్రప్రభువులు, భాషాభిమానులు, ధనవంతులు రు ౧౦౦౦లు విరాళ మొసంగి మహారాజపోషకులుగను, రు౫౦౦లనొసంగి రాజపోషకులుగను రు ౨౫ లొసంగి ప్రధానపోషకులుగను, రు ౧౦లొసంగి పోషకులుగను జేరి ఆదరించి పోషించి గ్రంథముల వెలువరించదగును. వీరల నామములు నివేదికలందును, గ్రంథములందును ప్రకటించబడును. పై వారల కందరికి సమితిప్రచురణము లుచితములు.

ఇంకను వివరములకు:—

కార్యదర్శి,

ఆంధ్ర వాఙ్మయసేవా సమితికార్యస్థానము,

పాల్వంచపోష్టు (Via)డోర్నకల్, నైజాంరైల్వే.

# సమితి పక్షమున

పరిముఖుల కొందఱి యౌదార్యముచే మునుముందు
వెలువరింపఁబడనున్న

## సభ్యుల గ్రంథములు

౧. 'ప్రమోది'- సాహితీ సంపుటి. వివిధ సభ్యుల రచనలు, సమితి, కార్యకలాపాదులతో, ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, ఎం. ఏ. గారి ప్రశంసాభిప్రాయమును బడసినది.

౨. ఉభయభాషాప్రవీణ విశ్వనాథ వేంకటేశ్వర కవిగారి 'ఖండ కావ్యములు'—

౩. చిలుకునూరి సుబ్బారావుగారి 'ఆంధ్రీకృత శివానందలహరి' 'సంక్షిప్త రామాయణ పద్యకావ్యము'—

౪. ముకుంద రామమూర్తిగారి 'మాహేశ్వరి'—

౫. సాహిత్య విద్యాప్రవీణ విద్వాన్ కొత్తపల్లి మృత్యుంజయ సోమయాజిగారి 'ఖండకావ్యములు' 'కథలు'—

౬. వ్యాసరచనా ప్రవీణ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారి 'ప్రణుతి శతము' దేవీపరము. మకుట నిర్ణాయకము లేని క్రొత్త పద్ధతి. 'హారతి'- ఖండకావ్యము; 'ప్రేమనగరి'- రాధాకృష్ణుల శృంగార సామ్రాజ్యము - అద్వైతసిద్ధి వరకు - ఇది ఖండ కావ్యరూపమైన అఖండ కావ్యము—

౭. పన్యాల వేంకట రంగనాథరావుగారి 'కావ్యమాలిక, ప్రేమలత. ఆంధ్రగీతి, ఎలిజీ' అను ఖండకావ్యములు, అనిల, సరసు. దిగంతం, స్మృతి పథాలు, అవును-నిజం, అనే కథాసంపుటి భావకవి, అంధకారం, పారిజాతం అనే నాటికా సంపుటి.

౮. సాహిత్య విశారద కొత్తపల్లి వేంకట రామ లక్ష్మీనారాయణశర్మగారి 'పాల్వంచ సంస్థాన చరిత్ర' పాల్వంచ శ్రీ భద్రాచల సంస్థానాధీశ్వరులైన కీ. శే. మహబూబు సర్ఫరాజవంతు శ్రీ శ్రీ రాజా పార్థసారథి అప్పారావు సవయి అశ్వారావు బహద్దరువారి జీవితము.